# సాహిత్య సమాలోచనము,

శ్రీ పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు, ఎం. ఏ.

1946

సాహితీ సమితి.
నాంపల్లి, హైదరాబాదు.

పండితోత్తములు, విమర్శకాగ్రేసరులు

చరిత్రరచనాచతురులు, గురూత్తములు

బ్రహ్మశ్రీ వేదమూర్తి

కురుగంటి సీతారామ భట్టాచార్యుల వారికి

ప్రేమోపహారము

*



నవోదయుని కృతజ్ఞత

# పరిచయము

శ్రీ హనుమంతరావు గుంటూరు మండలాంతర్గతమైన కోదూరు లో 31-12-1918న ప్రసిద్ధ బ్రాహ్మణ కుటుంబములో జన్మించినాడు. సికిందరాబాదు మహబూబు కాలేజిలోను, హైదరాబాదు నిజాం కాలేజిలోను వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయములోను విద్యాభ్యాసము చేసి ఎం.ఏ. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. చిన్నతనముననే సికిందరాబాదులో సాధనసమితి, గుంటూరులో సరస సారస్వత సమితి, ఆంధ్ర సాహిత్య మండలి, వేమూరులో కవితావనము మొదలైన సాహిత్య సంస్థలను స్థాపించి యువకులచే కృషి చేయించినాడు. ఇప్పుడు జ్యోత్స్నా సమితికి అధ్యక్షుడు.

సాహితీ సమితి సభ్యుడు. కొలది కాలము రైల్వేలో ఉద్యోగము చేసినాడు. గుంటూరు హిందూ కళాశాలలో ఇప్పుడు ఆంధ్రాధ్యాపక పదవిలో నున్నాడు.

ప్రతిభావంతుడైన హనుమంతరావు గేయములు, కథలు, నాటికలు అనేకము రచించినాడు. ఆకాశవాణిలో అనేక సార్లు ఉపన్యాసము లిచ్చినాడు. నిశితబుద్ధి యయిన ఇతని విమర్శలు విషయ వివరణమున విశదములై భావోద్దీపకములై యుండును. శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారికడ శుశ్రూష చేసి వృద్ధి లోనికి వచ్చిన ఈ సాధువర్తనుడు శివానుగ్రహమువలన ఇతోధిక వృద్ధి నొందునని నా విశ్వాసము.

శ్రీ శివశంకర శాస్త్రి

ఈ 'సాహిత్య సమాలోచనము' శ్రీ హనుమంతరావుగారు ఆంధ్ర శారదాపీఠమునకు సమర్పించిన భవ్యవ్యాసకుసుమము. సాహిత్యవిషయములను గురించియు, ఆంధ్రసాహిత్యమును గురించియు అప్పుడప్పుడు హైదరాబాదు మద్రాసు రేడియో స్టేషనులనుండి 'ప్రసారితము' లైన ప్రసంగములును, వేఱువేఱు తెలుగుపత్రికలకు వ్రాసిన వ్యాసములును వీని కొక చక్కని క్రమము కుదిరి ఆంధ్రసాహిత్యవికాసము చక్కగా బోధపడునట్లు సారవంతముగా రచియించిన యింకను రెండు వ్యాసములను కలియజేర్చి ఈ 'సాహిత్య సమాలోచన' మను గ్రంథము కూర్పబడినది. ఇందలి మూడు భాగములలో మొదటిభాగమునందలి సాహిత్యవిషయములు సిద్ధాంతరూపమైనవి; రెండవ భాగమున గ్రంథకర్త పదకవిత్వ, ప్రబంధవాఙ్మయ, రూపకవికాసాదులను గురించి చేసిన చక్కని పరిశీలనము కలదు. మూడవభాగమునందలి ఆంధ్ర సాహిత్యపరిణామ వ్యాస మొక యధ్యక్షోపన్యాసము. ఇందు ఆంధ్రసాహిత్య పరిణామము దిఙ్మాత్రముగ సూచితమైనది. ప్రాగ్వ్యక్త విషయముల ననుసరించి ఇది యొక యపూర్వగ్రంథ మనుటకు సందియము లేదు. ఈ 'సాహిత్యసమాలోచనము' శాస్త్రమునకు లక్ష్యలక్షణసమన్వితమైన ఆంధ్ర సాహిత్యచరిత్ర యన్న అత్యుక్తి కాదు. ఆంధ్రసాహిత్య పఠనాభిలాషులకు ఉపయోగకరముగ నుండునట్లు ఏతద్గ్రంథాంతమున చేర్పబడిన గ్రంథసూచిక ఈ గ్రంథోపయోగమును విలువను హెచ్చించుచున్నది. ఈ దృష్టి గ్రంథమునావశ్యకత ఎక్కువగ గలదు. ప్రాచీనాంధ్ర సాహిత్య పరిచయము గలవారిసంఖ్య నాటికినాడు క్షీణించుచున్నది. అందునను మనప్రాచీన సాహిత్యసిద్ధాంతములను గురించియు, సంప్రదాయములను గురించియు దెలిసినవారు చాల కొద్దిమంది.

నేటి కాలపరిస్థితులకు దగినట్లు ఆంధ్రసాహిత్య రంగమునను పరి[illegible]మున గొప్ప గాలిదుమారములు లేచుచున్నవి. సాహిత్యతత్త్వ, స్వభావ,

ప్రయోజనముల విషయమున పూర్వులలో నేడు వాద ప్రతివాదములు సాగుచున్నవి. ఈవాద ప్రతివాదములను పరిశీలించుచో ఈప్రశ్నములు నేడే పుట్టినవా? ఇంతవఱకు సాహిత్యమే లేదా? సాహిత్యసృష్టికి నేటినుండియే యారంభమా యనిపించుచున్నది.

ఒకవిధముగ జూచినయెడల మన తెలుగుసాహిత్యమున పునస్సృష్టికిప్పుడు మొదలనుట సత్యమే కావచ్చును. 'కావ్యం యశసేऽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే. సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' అని వందలకొలది సంవత్సరములనుండి ప్రవచింపబడుచు వచ్చిన కావ్యప్రయోజన నిర్వచనము నింతవఱకు కవిపండితలోక మాదరించి గౌరవించినను ఆధునికులు కొందఱు అజ్ఞానమైనదేమి, విజ్ఞానమైనదేమి దీని నధిగమించి క్రొత్తనిర్వచనములను జేయుచు క్రొత్తసిద్ధాంతములను ప్రతిపాదించుచున్నారు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక సిద్ధాంతములవలెనే ఇవియు నేటి సాహిత్యపరుల హృదయములలో కలకలమును రేకెత్తించి సంఘమును కల్లోలపఱచుచున్నవి. కవిత్వమన్న నేమి, ఎందుకు, ఎవరికొఱకు, కావ్యప్రయోజన మేమి, ఎవరికొఱకు అను ప్రశ్నములు చాలచోట్ల నేడు తఱచుగ వినవచ్చుచున్నవి. ప్రాచీనతమీద నొకవిధమైన యసంతృప్తి. నవ్యకావ్యసృష్టికి ఒకవిధమైన తహతహ అట్లు ప్రశ్నించువారిలో ఒకప్పుడు లేకున్నను వేఱొకప్పుడయినను గోచరింపకపోవు. ఈప్రశ్నలర్థహీనములైనవని తోసిపుచ్చుటకంటె వానిని సానుభూతితో నవబోధము చేసికొని వానికీయవలసిన సమాధానములను గుఱించి మననము చేయుట శ్రేయస్కరమును వివేకలక్షణమును. జాతీయ జీవితమునకు సంబంధించిన ప్రతివిషయమునను విప్లవ పరివర్తనములకు లోనై ప్రశ్నార్థకముగ పరిణమించుచున్న యీవిషమకాలమున సారస్వతముగ మన సాహిత్యపరిణామమును పరిశీలించినపుడు కవి సాహిత్యరంగమునందలి నేటి యలజడికి కారణము సుబోధము కాజాలదు

సాహిత్యము ప్రాచీనకాలమున ప్రధానముగ బ్రాహ్మణాధీనము. అధ్యయన, అధ్యాపనములు బ్రాహ్మణుల ప్రధానవృత్తులు. సాహిత్యస్రష్టలును వారే. అటు వెనుక కొంతకాలమునకు గాని క్షత్రియులు సాహిత్యరంగమున బ్రవేశింపలేదు. మన యిప్పటి పురాణవాఙ్మయము ప్రధానముగ క్షత్రియోపజ్ఞమని ప్రాచ్యపరిశోధక పండితుల వాదము. క్షత్రియకులజులైన భూనేతలు, కావ్యనిర్మాతలుగను కవిపోషకులుగను వాసికెక్కినవారనేకులు గలరు. వారెట్టి సాహిత్యమును సృష్టించినను అంతకుపూర్వము భారతలోకవ్యవహారమున నుండిన సాహిత్య ధర్మశాస్త్రముల నతిక్రమింపక గౌరవించి యనుసరించుచునే చేయుచు వచ్చిరి. వారది నేమశీలనగున్యదేశపరివర్తితమైన సాంస్కృతికదృష్టి, ధార్మికదృష్టి. వేదవేదాంగవిదుడును, కవితల్లజుడునైన బ్రాహ్మణునికి సంఘమునను సాహిత్యరంగమునను గూడ గౌరవోన్నతస్థానము నిచ్చి హిందూసామాజికు లితరవర్ణములవారు కూడ రాను రాను కేవలము కావ్యాధ్యయనమునకే కాదు, కావ్యసృష్టికి ఉపక్రమించి సాహిత్యసృష్టి సాగించిరి. ఇట్టిసృష్టి మన దేశమున అయిదారువందల సంవత్సరములకు పూర్వమే యారంభమయినది. అయినను సాహిత్యరంగమున బ్రవేశించిన బ్రాహ్మణేతరుల సంఖ్య కడు పరిమితము. వారిసంఖ్య వ్రేళ్లమీద నలెక్కపెట్టదగి యుండుటకు అప్పటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు కారణము. ఇట్టివారిలో కావ్యరచనమునకు గడంగినవారిసంఖ్య మరీ స్వల్పము. ప్రాచీన లక్షణకర్తలును, ఆలంకారికులును చూపినత్రోవ ననుసరించి వీరును భారతీయ సాహిత్య సంప్రదాయానుగుణముగ కావ్యము లల్లినవారే. నేటికిని సనాతనులైన సాహితీపరుల సాహిత్యసిద్ధాంతములు నవే; కావ్యములు నట్టివే. అదొక పెద్ద రాచబాట పడిపోయినదే నాడో శతశతాబ్దులకు పూర్వము; కావ్యరచనాసక్తులైన కవులును, పండితులును నలిగి నట్టుపెట్టలేని యా ప్రాతరాచబాటను గతానుగతికముగ పోయినవారే; పోవుచున్నవారే. దానిని వదలి క్రొత్తత్రోవ సృష్టి గావించుటకు ప్రతిభావంతులనేకులకు సమర్థతయు చాలదు; సాహసమును లేదు.

కాని కాలము మారినది. కడచిన రెండువందల యేండ్లుగ దేశకాల పరిస్థితులలో మార్పులనేకము వచ్చినవి. భారతీయులు స్వాతంత్ర్య విరహితులైనారు. పూర్వపు మన విద్యలనాదరించి పోషించు దేశీయప్రభువుల పరిపాలన మంతరించినది విజాతీయ ధర్మసంస్కృతి. సభ్యతలు గల బ్రిటీషు వారు మనకు ప్రభువులైనారు. మనము వారికి దాసుల మయినాము. మన విద్యాపద్ధతులు పూర్వమునకు విప్పటికి మారినవి. ఉన్నత పాఠశాలలలోను, విశ్వవిద్యాలయములలోను గూడ విద్యనేర్పు భాష ఆంగ్లమైనది. ఆంగ్ల విద్యా వ్యాపనము హెచ్చినది. రాజభాష ఆంగ్లము. ఆంగ్లభాషాద్వారమున మనకు యూరోపీయ సాహిత్యములతో సన్నిహిత సంబంధము కలిగినది. భారతీయ విజ్ఞానపేటికయైన సంస్కృతము ప్రచారమున లేకపోయినను సంస్కృతమునందున్న వేదశాస్త్ర కావ్యలక్షణ గ్రంథాదులు యూరోపీయ దేశభాషా గ్రంథములవలెనే ఆంగ్లమునకును పరివర్తితములై నేడున్నత విద్యాభ్యాసము చేయు నాలవర్ణములవారికి నందుబాటులోనికి వచ్చినవి. ఒక్క భారతీయ సంస్కృత విజ్ఞానము మాత్రమేకాక ప్రపంచమున వేలువేలు దేశములందలి యుత్తమ సాహిత్య విజ్ఞానముసైతము ఆవర్ణ మీవర్ణమనక ఉన్నతవిద్య నభ్యసించువారి కెల్లరకు లభించుచున్నది. పొగయోడ, ధూమశకటము, విమానము, రేడియో, వైర్లెస్ వచ్చి నేడు ప్రాత ప్రపంచమునకు, క్రొత్త ప్రపంచమునకు, ఖండములకు ఖండములకు, దేశములకు దేశములకు గల దూరమును గత్తిరించివైచి ఒండొంటిని మనయింటి ముంగిలికి, మన నట్టింటికి తెచ్చిపెట్టుచున్నవి. ప్రపంచమునం దేక్షణమున నెచ్చట మేధావులైన శాస్త్రజ్ఞులే క్రొత్త విషయమును గనిపట్టినను క్రొత్త సిద్ధాంతము ప్రతిపాదించినను ప్రతిభావంతులైన సాహిత్య విశారదులు తమప్రజ్ఞ జూపి ఏ నూతన సాహిత్యగీతులు వెలయించినను, ఏ యపూర్వ గ్రంథమును రచించినను మఱుసటిక్షణముననే వానిని వినగలుగుచున్నాము. తెలిసికొనగలుగుచున్నాము చదువగలుగుచున్నాము. దేశభాషలలోనికి శాస్త్రవిజ్ఞానము, ఈ యుత్తమకావ్యవిజ్ఞానము అనూదితమై పత్రికలద్వారా రేడియోద్వారా, గ్రంథములద్వారా జనులకు లభించుచుండుటచేత నేడు కావ్యసాధకుడొక్కడేకాదు, విద్యార్థి యొక్కడేకాదు, సామాన్య మానవుడుకూడ నఖిలప్రపంచ సంబంధి యగుచున్నాడు. ప్రపంచమున నే

మాయమూల ప్రచలితములగుచున్న భావములైనను సరే, సిద్ధాంతములైనను సరే, అతనిహృదయము నుద్రేకపఱచుచున్నవి; అతనిమనసులో నూతనభావములను పేరిరేపుచున్నవి. అతడు అమెరికా సాహిత్యమునందలి క్రొత్తపోకడలను గమనింపగలుగుచున్నాడు. జర్మని సాహిత్యమునందలి జిగిబిగులు పరిశీలింపగలుగుచున్నాడు. బ్రిటను, ఫ్రాన్సు, రష్యా దేశములలో బుట్టిన మహాకావ్యములను, నాటకములను జదివి యానందించుచున్నాడు; చైనా జపాను సాహిత్యములను విమర్శించుచున్నాడు; సంస్కృతము నేర్వకయే ప్రాచీనభారతీయ శాస్త్ర కావ్యకళా సిద్ధాంతములను పరామర్శించుకొనుచున్నాడు; తనకు లభ్యమగుచున్న అఖిల ప్రపంచ విజ్ఞానజన్యమగు నూతన దృష్టితో తన పూర్వుల సాహిత్యమును, సాహిత్యరీతులను, సంఘమును, ఆచారములను—సమస్తమును అన్వేషణజ్యోతిని వెలిగించి గుణదోష పరిశీలనము చేసికొనుచున్నాడు. అతనిస్థానము నేడొక్క యాంధ్రదేశమున కాదు, ఒక్క భారతదేశముననే కాదు. సమస్త విశ్వమానవ ప్రపంచమునను కులములను కులములకు, సంఘములను సంఘములకు, జాతులను జాతులకు మధ్యగల కృత్రిమావరణములు, సరిహద్దులు, నడ్డంకులు నన్నియు క్రమముగా సడలిపోయి 'విరిగిపోయి అతని దృష్టి పరిపారరంగము అత్యధికముగ విస్తరిల్లి అందువలనను నేడు విశ్వమానవ కుటుంబమున నొక్కడై తత్కుటుంబ కష్టసుఖములలో సమభాగి యగుచున్నాడు. నేడు ప్రపంచమునందలి వేలువేలు జాతులన్నియు గలసి, ఏకైక మానవసంఘముగ ముడివడి యొక్కమూసలో, నొక్కపోతలో నైక్యగతి భజించుచు క్రొత్త తీర్పులకు, క్రొత్త మార్పులకు లోనయి ఒక మహాసమష్టి మానవకుటుంబముగ పరిణమించుచున్నవి. వివిధ జాతుల సాహిత్యతరంగిణు లొకదాని నొకటి యొరసికొని ప్రవహించుచు, విశ్వమానవ సాహిత్యసాగరమునకు బాటలు దిద్దుచున్నవి. నూతన ప్రపంచ శక్తి తరంగడోలికల నూయెలలూగుచు నాతనిహృదయ ముద్రిక్తమై విభ్రమము నొందుచున్నది. జాతీయ జీవనమునకు సంబంధించిన ప్రతివిషయము నూతనవిజ్ఞానబల ప్రాభవ వైభవమున రచ్చవడుచున్న యాతనికి ప్రశ్నార్థకముగనే కన్పట్టుచున్నది. జాతీయమా విజాతీయమా, సనాతనమా అధునాతనమా, వైయక్తికమా సాంఘికమా, ప్రాచీనాదర్శమా నవీనాదర్శమా—అంతయు సందేహాస్పదమే. అంతయు ననుమానమే. ఈ ప్రశ్నములు విమర్శ జిజ్ఞాసాజన్య

ములు. ఏలనకయే విజ్ఞానము విజ్ఞానమే శక్తి. ఈ విమర్శను, ఈ జిజ్ఞాసను, ఈ విజ్ఞానబలమును కాదని త్రోసివేయుట శక్యమా, యుక్తమా?

నేటివరకు గొప్ప కలబోత, మహాసాంకర్యము. మన ప్రాచీన ఆచారములు మారినవి, అభ్యాసములు మారినవి, మతవిశ్వాసములు మారుచున్నవి, సంఘము మారుచున్నది. నూతన భౌతికశాస్త్ర విజ్ఞానాభివృద్ధితో సమస్తమును మారుచున్నది. అందునను విప్లవకరమైన మార్పు నేడు కాలస్వభావమే మార్పు ప్రపంచము మారుచున్నది. మనమిప్పుడు ఒక క్రొత్త ప్రపంచము వీధివాకిట నున్నాము. నూతనప్రపంచ జీవితమున కనుగుణముగ మన సమస్తమును సరదిద్దుకొనవలసిన యావశ్యకత కలదు. అట్లే మనసాహిత్యమునను, సాంఘిక ధర్మాధర్మములందును. అందువలననే నేడు సాహిత్యప్రయోజనమునుగురించి సాహిత్యభావమునుగురించి, ఇంకను నేక విషయములనుగురించి గాలిదుమారములు రేగుచున్నవి.

మనజీవితమునకు సంబంధించిన ఇతర రంగములందు వలెనే మనసాహిత్యరంగమునను అరాజకము ప్రబలినది; పూర్వపు సిద్ధాంతములు, ప్రాచీనసూత్రములు పనికిరావు; అవలంబనీయములైన నూతనసిద్ధాంతములేవో, నూతన సాహిత్యసర్గములేవో తెలియరావు పూర్వపువన్నియు శిథిలములైనవి; నూతనని ర్మాణ సూత్రములుకాని పథకముకాని విశదముగ గోచరించుటలేదు. నేటి ఆంధ్రసాహిత్య స్వరూపమిది; దానిలో యువజనుల ఉద్రేక వ్యాదియముల లోని భావములు తొణికిసలాడుచున్నవి. నూతన సాహిత్యరచనా ప్రయత్నమున క్రొత్త త్రోవలు త్రొక్కవలెనని క్రొత్త పోకడలు పోవలెనని రచయితల యుత్కంఠ కానవచ్చుచున్నది. నూతన విజ్ఞానబలమున క్రొత్త సాంఘిక ధర్మసూత్రములను చేసవలెనని రచయితలకుగల కుతూహలమును గోచరించుచున్నది. అయినను ఒకమాటి చెప్పకతీరదు. నేడు తెలుగురచనలు చేయువారిలో అనేకులు ప్రాచీన ఆంధ్రసాహిత్యపు తీరు తెన్నులెరుగని వట్టి యుత్సాహపరులే ఎంతటి ప్రపంచవిజ్ఞాన సంపన్నులమైనను మనము ఆంధ్రులమే. విజ్ఞానమెక్కువయినదని మనజాతియు మారదు; భాషయుమారదు. నేటినుండియే మనసాహిత్యము ప్రారంభముకాదు. మనకు సహస్రాబ్దుల నుండి బడిగ వచ్చు సంస్కృతియు గలదు, చరిత్రమునుగలదు. ఈ సంప్రదాయములను,

సాహిత్య చారిత్రములను మనము చక్కగ దెలిసికొని చేసినవాడుకాని నూతనసృష్టికి బలము, తేజము, ప్రాభవము నుండదు. నూతనకావ్యరచన చేయువానికి ప్రాచీనసాహిత్య సంప్రదాయజ్ఞాన మత్యంతావశ్యకము. తెలుగునుడికారము, పలుకులపొందిక, శబ్దముల స్నేహవిరోధములు, రీతులసొగసు, శయ్యలసొంపు — ఈ మొదలగునవి తెలిసినవాడుకాని కావ్యరచనాకీలకము దొరకదు; నూతననిర్మాణదక్షత కుదురదు. పద్యములల్లుట కవిత్వముకానట్లే జగి బిగి లేని పట్టి శుష్కపదములకూర్పు సాహిత్యముకానేరదు. నేడువెలువడు మనకావ్యములు పెక్కింట ఛందఃప్రస్తారపుకూర్పులును, పదములతీర్పులునున్నవి కాని కవితాగుణము, శిల్పము, రసస్నిగ్ధత లేదు.

ఉత్తమకావ్యము ఉత్కృష్టమైన కళారచన. అది సార్వజనీనక, సార్వకాలిక ధర్మవిశిష్టమయినది. అందువలననే ఉత్తమకావ్యములు వందలకొలది యేండ్లక్రింద విరచింపబడినను అవి నేటికిని నవ్యనూతనములై మనలనలరించి మనకానందమును గూర్చుచునేయున్నవి. ఏదేశమునందలి యుత్తమకావ్యమయినను మనభాషలోని కనూదితమై వచ్చినపుడు అది దేశ, జాతి, మత విభేదముల కతీతమై మన కానందపారవశ్యమును గలిగించుచున్నది. ఏదేశమునగాని, ఏకాలమునగాని ఉత్తమసాహిత్యధర్మ మిట్టిదే. ఈదృష్టితో జూచినపు డుత్తమసాహిత్యమునకు ప్రాచీన, నవీన భేదములును లేవు. స్వజాతి, విజాతి భేదములును లేవు. అట్టియుత్తమ సాహిత్యసృష్టియే మనలక్ష్యముగ నుండవలెను. నవ్యసాహిత్యప్రయత్నము లట్టియుత్తమ సాహిత్యసృష్టికి దారితీయగలవనియే నాయాశ. హృదయము విశాలమై, విజ్ఞానసంభరితమై పరిపక్వస్థితిపొందిన కళానిపుణు డెప్పటికైన నట్టికావ్యసృష్టిలో సిద్ధినందగలడు.

నూతన సాహిత్యసృష్టికి గడంగుచున్న ఆంధ్రయువకులకు ప్రాచీన సాహిత్య సంప్రదాయరీతులను దెలిపి శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావుగారి 'సాహిత్య సమాలోచనము' ఉపకారకము కాగలదని నాతలంపు. శ్రీ హనుమంతరావుగారు ఇంకను అనేకగ్రంథములను రచియించి సాహిత్యకృషిచేసి యశస్సు సముపార్జింతురుగాక యని కోరుచున్నాను

శ్రీ పుల్లంపల్లి సోమశేఖర శర్మ.

# విషయానుక్రమణిక



---

• సాహితీ సమితి రజతోత్సవ సభలో చదివిన వ్యాసము.

* హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్ ప్రథమ సమావేశములో చదివినది.

# కొన్ని సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 8 | కావ్యేషువా | కావ్యేవా |
| 27 | 5 | thy be not | thou be |
| 34 | 18 | వర్ణ్యకము | వర్ణ్యకులు |
| 37 | 11 | కాద్వ్యవస్థ | కాదివ్యవస్థ |
| 47 | 2 | పూ౯ఫల | పుష్పఫల |
| 47 | 4 | కేరికా | కారికా |
| 65 | 5 | లోనై | లోనై |
| 66 | 22 | నుంచిన | చూచిన |
| 68 | 7 | గద్యాత్మకమనియు | గద్యాత్మకమనియు / పద్యాత్మకమనియు |
| 73 | 10 | వఱలెను | వరలవలెను |
| 76 | 7 | వదలినది | వరలినది |
| 84 | 12 | మిడ | మిటు |
| 111 | 18 | సాక్షిక | పాక్షిక |
| 127 | 2 | రాణించు | క్షీణించు |
| 128 | 19 | సార్థక్య | పార్థక్య |
| 133 | 7 | చాటించు | ఘాటించు |
| 133 | 11 | సత్ర్ఛా | సత్ఛా |
| 135 | 7 | దృశ్య | శ్రవ్య |
| 136 | 19 | నాగర | అనాగర |
| 141 | 6 | కరుణము | కరుణకము |
| 143 | 8 | నాటకమయ | నాటకీయ |
| 143 | 9 | ధర్మ | ఆదర్శ |
| 167 | 19 | సహిత్య | సహితస్య |
| 169 | 8 | సాధువుల | సాధుత్వముల |
| 169 | 24 | expresses complete | expressed by them |

# సాహిత్యోద్దేశము

## ౧

లోకవ్యవహారములో సాహిత్యము - సారస్వతము - వాఙ్మయము - అనుపదములు సమానార్థకపదములుగా ద్రష్టవ్యమగుచున్నవి. కాని యీమూడు పదము లర్థములో నంతరము కలవిగా పరీక్షపై తెలిసికొనగల్గుదుము. సాహిత్యమనునది దేశకాలపరిమితముగాక, సర్వకాల సర్వజనీనముగానుండి విశ్వశ్రేయస్సునుగోరి నిర్మింపబడిన కావ్యసంచయమునకు చెందును. సారస్వత మనునది యక్షర రూపమైన సకల విద్యా శాస్త్ర కళాదులకు వర్తించును. వాఙ్మయమనగా వాక్కుయొక్క వికారము; అనగా లిఖితసంభాషణాది సమస్త వాగ్వ్యవహారమునకును వాఙ్మయమనుపదము చెల్లును. ఇది సర్వసాధారణమైన పదము. సాహిత్యము- సారస్వతము- వాఙ్మయము: ఇవి యుత్తరోత్తర విశాలములైనవి. ఈ మూడు నొకే కేంద్రము గల మూడు వలయములవంటివి. సాహిత్యము పరిమిత వలయము; దీనిని సారస్వత వలయము చుట్టినది; ఈ రెంటిని చుట్టినది వాఙ్మయవలయము. సాహిత్యమును, సారస్వతమును వాఙ్మయమని పిలువవచ్చును. కాని సారస్వత వాఙ్మయము లనునవి సాహిత్యమునకు వర్తింపవు.

ఇక ఉద్దేశమను పదము: ప్రతివస్తువునకు కార్యకారణ భావమున్నది. ఘటమునకు మృత్తిక కారణము; అట్లే మాన

సిక సంబద్ధ విషయములకును. మానవు డేకార్యము నిర్వహిం
చినను వెనుక నొక యాలోచన యుండితీరును. ఈ యాలో
చనమునే యుద్దేశమని, కారణమని యననగును. ఇది పునాది
వంటిది. ఒక యుద్దేశమును పురస్కరించుకొని మానవుడొక
కార్యము నిర్వహించును. అత డాశించిన యాయుద్దేశముపరి
ణామఫలముగా తిరిగి ప్రతిఫలించును. ఉద్దేశము- కార్యము-
పరిణామము; ఇది క్రమము. వీనిలో నుద్దేశము లోపించినను
పరిణామపరిశీలనముచే దానిని గుర్తింపవచ్చును. కాని కార్య
మునుబట్టి దాని నెఱుగవచ్చును. ఇవ్విధముగా నుద్దేశ
కార్య పరిణామము లన్యోన్యాశ్రయములు.

కాగా, సాహిత్యోద్దేశ మిపుడు ప్రసక్తము. సాహి
త్యము 'సత్యం, శివం, సుందరం' అను పరమాశయముల
నిమిడ్చికొనినది. సాహిత్యమునకు కవి - విమర్శకులు ప్రవ
క్తలు. సౌందర్య ద్రష్టయు స్రష్టయు కవి. దీననే యాతని
'కవిబ్రహ్మ' యనినారు. విమర్శకు డేతద్వ్యాఖ్యాత. సాహిత్య
మొక మధుర దర్శనము. తదితర దర్శనముల నవలోకించుట
కెంతటి యధికారము వలయునో సాహిత్యదర్శనమున సాక్షా
త్కారమున కంతటి యధికారము వలసియున్నది. సహృద
యత్వము, రసజ్ఞత, వ్యుత్పన్నత సాహిత్యారాధనమున కుప
కరణములు.

సహృదయత్వ మనగా హృదయము కలిగియుండుట
యని సామాన్యార్థము. ప్రతివానికి హృదయ మున్నది; కాని
యది యున్నటుల తెలియువాడే సహృదయుడు. అనగా

'నాత్మ వేదనోన్ముఖమైన యంతరంగము' కలవాడు. సహానుభూతి వ్యాప్తికముగా, నిష్కలంకముగా సానుభూతితో నాయా వాతావరణములయందు సంచరింపగలిగి యాయా పాత్రలనుగాని, విషయములనుగాని యవలోకించి తత్తదనుగుణముగా స్పందించు హృదయము కల్గియుండుట.

రసజ్ఞత యనగా రసము నెఱుగుట యని వాచ్యార్థము. అనగా విభావానుభావ సాత్త్వికవ్యభిచారీభావ సంయోగ ఫలితముగా పర్యవసించు రసస్వరూపమును దెలియుట. విభావాదికముల నెఱుగకయే యాయా భావములకు తత్తదనుగుణముగా సంచలనము పొందువారును రసజ్ఞులే. లక్షణాదికము నెఱిగియు రసజ్ఞులు కానివా రున్నారు.

ఇక వ్యుత్పన్నత యనగా లోకశాస్త్రానుభవముతో కూడిన పాండితి. పరిజ్ఞానము సమకూర్చుకొనుటలో దేశాటనము, బహుకావ్యపఠనము, సంప్రదాయజ్ఞులైన మహాత్ముల సాంగత్యము మున్నగునవి తోడ్పడవలెను. ఇన్నిటితో నుదయించిన సంస్కారమే వ్యుత్పన్నత యగును. ఇన్ని కల్గియు సంస్కారము పొందనివా రున్నారు.

ఈ యుపకరణములతోడనే సాహిత్యారాధనకు పూనుకొనవలెను. అప్పుడే సాహిత్యోద్దేశమును గ్రహింపవచ్చును. ఎంతవరకీ యుపకరణములు లేక పరిశీలించుచుందుమో యంతవరకు సాహిత్యోద్దేశము ప్రశ్నారూపముననే యుండి యనేక యపోహలకు తావిచ్చును. నేడు లోకమున వ్యవహరింపబడుచున్న సాహిత్య మనునట్టిదిగాని,

సాహిత్యోద్దేశ మనుసృష్టిదిగాని నిత్యమైన సాహిత్యపదములు గావు. సార్వజనీన, సార్వకాలీనత లందు మృగ్యము.

సాహిత్యోద్దేశ మన్నికాలములందును, అన్ని దేశములందు నొకటే యయియుండును. జీవితోద్దేశ మెట్లు బ్రహ్మానందానుభవమో, అట్లే సాహిత్యోద్దేశము సైతము బ్రహ్మానంద సహోదరమగు రసానందానుభవ మగును. 'రసో వై సః' అను శ్రుతివాక్యము జీవితమునకు, సాహిత్యమునకు చెందినది. ఋషిప్రోక్తమైన వాక్యము బ్రహ్మానంద సాధకులకు ప్రమాణము. రసానంద పిపాసులకు కవివాక్య మట్లే ప్రమాణము. కవి ఋషితుల్యుడు. కావుననే 'నానృషిః కురుతే కావ్యం' అనినారు.

మోక్షగాముల కెట్లనేక పథము లనుగమ్యమానములై ప్రతీయమానము లగుచున్నవో యట్లే సాహితీదర్శనాలక్ష్యమును గడించుట కనేక మార్గము లాయాయుగములలో ననుగమ్యమానములైనవి. ఆయా మార్గములే యాయా కాలానుగుణముగ నుద్భవించినయుద్యమముల పరిణామములు.

వైదిక వాఙ్మయముయొక్క గహనతయే పురాణ గ్రంథరచనోద్యమమునకు హేతువు. శైవ వైష్ణవ సంఘర్షణమే వీరశైవవైష్ణవోద్యమములకు కారణము. అనుకరణ బాహుళ్యమే స్వతంత్రరచనోద్యమమగు ప్రబంధప్రక్రియకు దారితీసినది. కర్మసిద్ధాంతాచరణాశక్తతే భక్తిమార్గావలంబనమునకు కారణము. ప్రాచ్యసాహిత్యసూత్రములపై ప్రత్యయము లేకపోవుటవలననేమి, కాలాభావమువలన నేమి

సామాన్యజనుల కందుబాటులో సాహిత్యము నుంచవలెనను ఉద్దేశమే నవ్యసాహిత్యోద్యమమునకు మూలము. ఈ విధముగా నుద్యమములు బయలుదేర సాహిత్యము ననేక గతుల నడిపినవి.

ప్రాచీన లాక్షణికుల సాహిత్యోద్దేశమును గమనింతము. సప్తసంతానములలో కావ్యము శాశ్వతమైనది. 'విశ్వ శ్రేయః కావ్యం' అనినారు. అనగా సార్వజనీనత యుండవలెనని సూచ్యార్థము. 'వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' అనుటలో విశ్వశ్రేయస్సెట్లు కలుగవచ్చునో లక్షీకరించినాడు! కావ్యాత్మ మీమాంస యొనరించి లాక్షణికులు రసానందానుభవమునకు కావ్యమందలి వివిధాంశలను పృథక్కరించినారు. అవే రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచితులు. లక్ష్యమొక్కటే. నాటికినేటికి దానిని సమీపించు మార్గములు మాత్రము భిన్నములు.

జీవిత లక్ష్యమును సాధించుటకు కర్మ, జ్ఞాన, భక్తి మార్గము లుద్దేశింపబడినవి. ఆత్మానందమే పరమోత్కృష్టమైన జీవితధర్మము. తదానంద సంధానమునకే యీ మార్గములు. సాహిత్య మీ త్రిమార్గాశ్రయము. ప్రభు, సుహృ, త్కాంతాసమ్మితములని లాక్షణికుడు వ్యపదేశించినాడు. వేదములు కర్మను విధించునవి. పురాణములు ధర్మపథముల నడచినవారిని గూర్చి నివేదించి, కర్తవ్య ధర్మముల నిరూపించి, ఫలాపేక్షలో మనుజునికి నుత్సాహము కల్పించునవి.

కావ్యము లోకమును మరపించి మురిపించునది. అది కాంత వాక్కువలె సున్నితముగ, సుకుమారముగ, లలితముగ, వ్యంగ్యమాత్రవిలసనముతో సంస్కరించునది.

సాహిత్యము సౌందర్యమూర్తి. సౌందర్యావిష్కరణాస్వాదనములు సహృదయ వేద్యములు. సాహిత్యోపాసనమే యీశ్వరోపాసనము. ఇదే సౌందర్యోపాసనము. రససిద్ధి లేక సౌందర్యసాక్షాత్కారమే ఫలము. ఇయ్యది యలౌకికానందస్వరూపము. అతీంద్రియమైనది. ఇట్టి యానందమును సశరీరముగ ననుభవింపదగినది.

సాహిత్యము రాజసతామసవృత్తులను లీనమొనరించి శుద్ధసత్వమును ప్రకాశింపజేసి తద్వారా సౌందర్యాలోకనమున కర్హత నిచ్చునది. సాహిత్యము నిరంతర భావనావిశేషముచే పరబ్రహ్మానంద సహోదరమగు నానందము నాస్వాదింపజేయునది. నిత్యచైతన్యము గలిగినట్టి, శుభప్రదమైనట్టి రసానుభవమును కల్గించి మనోనేత్రమునకు దివ్యసాక్షాత్కారము కల్గించునది సాహిత్యము.

ఇట్టి పరమోత్కృష్ట ఉద్దేశము గలది సాహిత్యము. అందుచేతనే యిది మధురదర్శనమైనది.



[6-6-44 తేదీన హైద్రాబాదు రేడియోనిలయమునుండి ప్రసారితము]

# మాటలలో భావార్థములు



ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రా సంసారం న దీప్యతే.

అని శబ్దమునుగూర్చి లాక్షణికుడైన దండి వచనము. శబ్ద మను జ్యోతి లేకున్న నంధతమస్సులతో ముల్లోకములు నిండి యుండెడివని శ్లోకార్థము. శబ్దమున కంతటి విలువయున్నది. నాదప్రతిమార్థములని శబ్దము త్రిగుణాత్మకమైనది.

భావః కవేరభిప్రాయః కావ్యేష్వా సిద్ధి సంస్థితః అని భావమునుగూర్చి యొకని నిర్వచనమే. కావ్యగతమైన కవి యభిప్రాయము భావ మని నుడివినాడు. భావ మను పద మనేక పదార్థములకు చెందుచున్నది. స్థితి, మత, తాత్పర్య, ఇంగితాది వివిధావస్థల కీపదము వర్తిలుచున్నది. ఇట్లే యర్థ మను పదము హేతు, ఇచ్ఛ, ప్రయోజన, ఆకూతాది వివిధా వస్థలకు సరిపోవుచున్నది.

కాగా, భావార్థములు శబ్దము నాశ్రయించినవి. శబ్దము లేనిదే యర్థము లేదు; భావ మంతకన్నను లేదు. అట్లే భావములేక శబ్దమునకు స్థితి లేదు; అర్థము కాకపోయిన భావము స్ఫురింపదు. ఇవ్విధముగా శబ్దార్థభావము లన్యోన్యాశ్రయములు. శబ్దార్థములు ప్రకృతిపురుష సంబం ధము కలవిగా కవి కాళిదాసుని సూక్తి.

కాని భావార్థముల కంతర మున్నట్లు సూక్ష్మపరిశీల నమువలన దెలియును. అర్థము శబ్దగతము; అది శబ్దము నర్థించిన వచ్చునది. శబ్దము భాషాశాస్త్రసంబంధి కనుక నర్థము భాషాతత్వముమీద నాధారపడినది. అర్థజ్ఞానమునం దధికారము గలవానిని పండితుడందురు.

భావ మనగా నర్థమేకాక యర్థాంతరముకూడ. ఇది సందర్భపురస్కృతము. మానవుడు తాను భావించిన యంశమును పదజాలముద్వారా యందించును. ఒక్కొక్కప్పుడాతని భావమును సంపూర్ణముగా నాపదములు వ్యక్తీకరింపకుండుట యనుభవసిద్ధము. భావము పదములను నిమిత్తముగా గైకొని సందర్భమును స్మరింపజేయుచు విహరించునది. సందర్భశుద్ధి, సన్నివేశ ప్రాధాన్యము, పాత్రముల పౌర్వాపర్యములు, శబ్దార్థములతో సమన్వయించుకొని సమూహన విచారించినపుడు వచ్చు విశేషము భావము. భావమునకు పదము కేంద్రము వంటిది. సందర్భాదిగుణములు వస్తులములవంటివి. ఉదాహరణమునకు భారత సభాపర్వములో భీష్ముడు ధర్మజునితో శిశుపాలునిగూర్చి యనిన వచనము నారయుడు :

“పాలిత దుర్ణయుండు శిశుపాలుడు బాలుడు వీనినేల భూ
పాలక నీకుఁ బట్టునఱుపఁగ మఱి ధర్మువెఱుంగ వీఁకిం
బోలునె రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్య ల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్త మహాత్పరివాదశీలికిన్.

సాహిత్య

అచ్యుతు నర్చితు జేయగా శిశుపాలుడు ధర్మరాజు నాక్షేపించుట, అందులకు ప్రియవచనములతో శిశుపాలుని ధర్మరాజు శమనయించుటలు తెలియవలయును. పిమ్మటగాని భీష్ముని వచన మన్వయము కాదు. పద్యములో 'శిశుపాలుడు బాలుడు' అనినపుడు శిశుపాలు డమాయకు డనియు, అల్పు డనియు, సదసద్వివేకజ్ఞానశూన్యు డనియు నర్థాంతరమగు భావము 'నీతు' అనినపుడు, సర్వధర్మకోవిదుడు, నీతి విచక్షణుడు, న్యాయపరిపాలకుడు నగు నంతటి గొప్పవాడైన ధర్మరాజునకు-అని భావము. అంతటి ఉదాత్తగుణపూర్ణుని కింత యవినీతిపరునితో మాటలతో నిమిత్తమేమి? అని అన్వయము. తుది రెండు పాదములకు-ఎంత విశదీకరించినను ధర్మపరిశీలనాశక్తి యట్టి నీచున కలవడునా యనియు, ఏల యీ కాలయాపన మనియు భావము. ఈవిధముగా భావ మర్థాంతరము.

భావము హృదయగతము. కవి హృదయము సహృదయుడైన రసజ్ఞునకే వేద్యము. కవి హృదయసదృశమైన హృదయము కలవాడు సహృదయుడు. కావున భావము సాహిత్యతత్త్వముపై నాధారపడినది. ఉత్తమభావాధికారము కలిగినవానిని సాహితీపరు డందుము.

కవి భావించినది భావమని తెలిసికొంటిమి. భావించుట యనగా నిరంతరాలోచనముచే సాధితమైన ఒకానొక క్రియావిశేషము. 'ఆత్మతో సంభాషించుటయే భావించుట' యని యొక పాశ్చాత్యుని నిర్వచనము. కవి యాలోచనముచే

మథించి, గ్రహించి దర్శించిన యొక రసమయగోళపు భావము. మహోన్నతభావము లన్నియు హృదయాంతరాళ ములనుండి ప్రవహించును. హృదయమార్గ్రితమై, రసగ్రహణ గుణసమన్వితమై, నిగ్గును దేల్చు సున్నితయంత్రమై వర్ధిల్లును. సమస్త కలుషములు హృదయములో స్వచ్ఛఫలక మందువలె ప్రతిఫలింపగలవు. సుసంస్కృతమై, శ్రేయో దాయకమై, సమగ్రమై, సుందరమై, సత్యమై భావము పరి ష్కృతమగుట హృదయమందే.

ఇక నర్థములు త్రివిధములుగా లాక్షణికనిరూపితము. శబ్దమునకున్న అభిధ, లక్షణ, వ్యంజన వృత్తులను పురస్క రించుకొని వచ్చునవే వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థములు. వాచ్యార్థ మనగా శబ్దము నర్థించినపుడు సూటిగా వచ్చు అర్థము. శబ్ద మర్థమున కుపలక్షకము. శబ్దోచ్చారణము వలన తద్గతమైన వాచ్యార్థము మన కొక వస్తువిశేషము నెదుట సాక్షాత్కరించును. ఉదాహరణమునకు 'గోవు' అనినంతనే శబ్దమునకున్న ప్రతిమాగుణము ద్యోతకమగును గదా! ఇట్టిదే వాచ్యార్థము.

వాచ్యార్థము నుల్లంఘించి, యూహద్భూతమైన అర్థ మును ప్రసాదించునది లక్ష్యార్థము. ఉదాహరణమునకు 'మీరు వెళ్లు మార్గములో చెఱువున్నది' అనినపుడు మార్గ మధ్యప్రదేశములో గమన నిరోధము గల్గించుచు చెఱు వున్నట్లు వాచ్యార్థము. 'మార్గములో' ననగా 'మార్గము ప్రక్కన' యనిగదా వక్త్రభిప్రాయము! ఇట్టిదే లక్ష్యార్థము.

వాచ్యార్థములవలె సూచింపబడక, లక్ష్యార్థము వలె సామాన్యముగాక, వాచ్యార్థమునకు వ్యతిరేకార్థ స్ఫురణము కలిగించునది వ్యంగ్యార్థము. ఉదాహరణమునకు కళాపూర్ణోదయములో సుగాత్రికి సఖు లుపాయములు జెప్పు సందర్భములో—

'దంపతు లిరువురును వివేకు లని చెప్ప'

అను పాదములో 'వివేకు' లనగా 'అవివేకు' లనిగదా సఖుల యుద్దేశము! ఇదే వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యమందే భావ సౌకుమార్యమును గమనించుటకుగాని, నిశితబోధనా విధాన మనుగమించుటకుగాని శక్తియున్నట్లు కనిపెట్టి కాబోలు దీనికి కావ్యమునందు ప్రాధాన్య మిచ్చినారు లాక్షణికులు.

ఇట్లే భావ మను పదమునుగూడ నానారీతుల లాక్షణికులు ప్రయోగించినారు. వ్యాకరణములో భావ మనగా ధాత్వర్థము. రసప్రకరణములో విభావ, అనుభావ, సాత్త్విక వ్యభిచారభావము లని కన్పించుచున్నవి. ఇవి యన్నియు పరస్పర భిన్నము లనియు, నన్నియు క్రమావస్థల కుపకరించునవనియు, తుదకు రసములో పర్యవసించునవనియు తెలియును. ఈ రసభావమునకే లాక్షణికులు గౌరవమిచ్చినారు.

ఈ విధముగా భావార్థముల కన్యోన్య సంబంధము, సూక్ష్మాతిసూక్ష్మమైన యంతరములు గలవు. మాటల నాశ్రయించినవి యర్థభావములు. మాటలలోని యింద్రజాల మనినపుడు కారణము కన్పింపక ఫల మభివ్యక్తమైనట్లు తత్ఫలముగా చక్కలిగింత కలుగుచున్న ట్లభిప్రాయము.

ఇంద్రజాలములో ఫల మభివ్యక్తమగునుగాని కారణజాతము బుద్ధి కందదు.

మాటల యింద్రజాలము మాటలలోనే లేదు. వాని ప్రయోగములోనున్న వైవిధ్యములో, సౌకుమార్యములో, వైచిత్రిలో నున్నట్లు గమనింతుము. ఆయా మాటలకు వాని ప్రత్యేకత యుండనే యున్నది. వేని యర్థము వానిదే. మాటల యింద్రజాలము కవిత్వమునకు జెందినదే కాని శుష్కమగు వచనమునకు దాని నాపాదించిన దాని గతి కన్నుతగిలినట్లగును. నిత్య వ్యవహారములో మాటల యింద్రజాలము కల్పించినచో నది కవిత్వసంబంధమే యగును.

శ్రవణపేయముగా కొన్ని మాటల కూర్పులుండును. 'కీర్తన పాత్ర చిత్ర మృదుగీతి కలాకలన ప్రవీణతకై' అనినపుడు రేఫ పౌనఃపున్యమును, 'చెందొవ విందు మందువలె జిందు రుచిందగ' అనినపుడు బిందుపూర్వక దకార పౌనఃపున్యమును శ్రవణానందమును కలుగజేసినవి. ఇట్టివానినే గుణాలంకారములక్రింద పరిగణించినారు లాక్షణికులు.

కాలగతిలో పడి శబ్దము స్వరూపములోను, నాదములోను, అర్థములోను మార్పు చెందుచుండును. ఆచారవ్యవహారముల కనుగుణముగా శబ్దములు పూర్వ మెన్నెన్నో యర్థములలో ప్రయోగింపబడినవి. కాలపరిణామములో నవి కొన్ని యర్థములలోనే రూఢి చెందినవి. చీర యను శబ్దము సామాన్య వస్త్ర విశేష మను అర్థమునుండి స్త్రీ ధరించు వస్త్రవిశేషములో, 'కైంకర్య' మను పదము 'స్వామి సేవ'

యను అర్థమునుండి 'సంగ్రహించుట' యనుదానిలో 'కంపు' అను మాట 'గంధ'మను అర్థమునుండి దుర్గంధ మనుదానిలో రూఢ మగుచున్నవి.

శబ్దస్వరూపము తెలియనివారిచేగాని, విద్యాగంధము లేనివారిచేగాని ఉచ్చరింపబడి కొన్ని శబ్దములు నాదమును గోల్పోవుచుండును. 'వెళ్లు' అనుటకు 'ఎల్లు' అనియు, 'గొప్పవారు' అనుటకు 'గొప్పోరు' అనియు, 'ఏన' అనుటకు 'సిన' అనియు, 'ఏమది' అనుటకు 'ఏంది' అనియు పూర్వ నాదములను గోల్పోయి విన్పించుచుండును.

భిన్నప్రాంతములలో నొక్కే వస్తువును సూచించు పదములు భిన్నములుగా నున్నవి. 'తాళము' నకు 'కప్ప' 'పచ్చడి' కి 'తొక్కు' 'ఆగుట' కు 'సైసు' 'గురువుగారు' నకు 'అయ్యవారు' యున్నగు ప్రయోగము లిట్టివే.

వక్తృభావోద్వేగమును సూచించుట కుపయుక్తము లగు పదములు విచిత్రములుగా నుండును. 'మహాచెడ్డ యిష్టము' అనినపుడు 'మహాచెడ్డ' అను పదములు వ్యస్తార్థములలో నిష్ప్రయోజనములు. కేవల ముద్వేగము, ఇచ్ఛలో పరాకోటి తెలుపుటకు ప్రయోగింపబడినవే కాని వేరు ప్రయోజనము వానికి లేదు. లోకములో 'పడిచస్తాడు' అనినపుడు కావ్యములో 'ఈ వెడమాటల నను నేటికిఁ జంపెదరు' అనినపుడు 'చావు' అను శబ్దమునకు ద్వైవిధముగనే పృథక్త్వము సున్న.

శబ్దములు కొన్ని యితర శబ్దములతో కూడినపుడు వింతమైన నూతనార్థముల ప్రసాదించును. 'పిడత మొహంబు' అనినపుడు విఫలమనోరథుడై దైన్యదశను పొందినవాని ముఖ వైఖరి సూచింపబడినది. ఇట్టివే 'చట్టిముక్కు' 'ఏనుగుకాలు' 'మట్టిబుఱ్ఱ' మొదలైనవి. వీనిని క్రమముగా నలంకారముల క్రిందజేర్చినారు మన లాక్షణికులు.

ఇట నలంకారములగూర్చి స్వల్పముగా చెప్పవలెను. అలంకారములు, శబ్దార్థాలంకారము లని రెండు విధములు. శబ్దాలంకారములో నాదమునకు గౌరవము. అర్థాలంకారములో భావమునకు గౌరవము. కవి తన కుపలభ్యమానము లైన పదముల నన్నిటిని వివిధావస్థలలో సంపుటీకరించి తన మనోగతమైన యభిప్రాయము వ్యక్తీకరించును. ముందు మనవిచేసినట్లుగా నాతని భావమును సంపూర్ణముగా నందించుట కా పదములు సరిపోవు. అపు డాత డలంకారముల చెంతకు బోవును. సాదృశ్యకల్పనము, ఇతర సన్నివేశ స్ఫురణము మున్నగునవి యాలంకారిక సామగ్రి. స్వీయానుభూతాంశము తనతో సమానముగా, సమగ్రముగా, సహృదయ సాక్షాత్కారము కల్గించుటయే కవియొక్క నిరంతర సాధనము. కనుక భావవ్యక్తి కుపకరించునవే అర్థాలంకారములు. నాదవ్యక్తి కుపయోగపడునవి శబ్దాలంకారములు. రెంటికీ పరమాశయ మానందసంధానమే. ఒకటి హృదయగోచరము. రెండవది శ్రవణగోచరము.

కావ్యమునకు ముఖ్యాంగము లనదగు భావ, వస్తురచనలలో రచనము శబ్దార్థసమన్వితమైనది. వస్తువు లోక కావ్యములలో సిద్ధమైనది. భావము కవి మనోగతమైనది. మానవుని కొక్కనికే జంతుకోటిలో భావనాశక్తియున్నది. ఇది యెంతము పెరిగిన కొలది, లోక కావ్యాది పరిశీలనము చేసిన కొలది యభివృద్ధిపొందుచు నైశిత్యము బడయుచుండును. ప్రతి మానవుని కభిప్రాయము లుండును. కాని బంగారము పుటములోవలె వాని నాలోచన మను అగ్నిగుండమున వ్రేల్చిన గాని భావములుగా పరిణమింపవు. ఆలోచనాశక్తి కలిగి యభ్యాసము లేకపోయినచో గాలిలో కత్తిసాము చేయుట వంటి దగును. బుద్ధిభావములు రథ్యనాశ్వ సంబంధముకల విగా నెంచిన తెనస పెద్దల యభిభాషణము.

ఆ యుత్కృష్టభావమే, ఆ విశ్వసత్యమును ప్రకటించు కవితాభావమే ప్రపంచమును పాలించునది. మనోహరమైన మాటల నేరికొని, స్ఫుటమైన యర్థములను బోసి సరసముగా జేసి, సుసంపన్నమైన భావమును పొదిగి కవి విశ్వమును పరిపాలించువాడు. నాదబ్రహ్మ సాక్షాత్కార మొందని పదసంపుటులు వ్యర్థము. అట్లే యర్థములేని శబ్దములు పశీకట్టురాళ్ళవంటివి. భావములేని శబ్దార్థములు 'భావజుడులేని పాడుమేడ' వంటివి. కావున శబ్దము-అర్థము-భావము, ఇవి ఉత్తరోత్తర ప్రధానములు. భావము ప్రథమము ప్రభవించును. పిమ్మట సార్థకమైన శబ్దావతరణము జరుగును. కవి భావమునుండి యర్థముమీదుగా శబ్దమునకు

ప్రయాణము చేయుచుండును. సహృదయుడైన విమర్శకుడు శబ్దములనుండి భావమునకు ప్రయాణ మొనర్చును.

భావప్రకాశమే కవిప్రయత్నము. తన్నిజస్వరూప ప్రకటనమే విమర్శకుని బాధ్యత. శబ్దములోని నాదప్రతిమా ర్తముల కంతరమైన భావముచేతనే ముల్లోకము లంఘించి తమస్సులనుండి విడివడునది. అట్టి భావోదయమే జ్ఞానోదయము. ఐంద్రజాలికుని మాయలోబడక నిజతత్వమెఱుగుటకై సంస్కారము బడసినవాడే మహాత్ముడు. శబ్దములో భావార్థముల నాతడెరిగి బ్రహ్మతత్త్వము నెరుగగలడు. అట్టి జ్ఞానోదయమే జ్యోతిరావిర్భావము. అదే విశ్వము నేలు పరంజ్యోతి.

'తమసో మా జ్యోతిర్గమయ'



[మద్రాసు రేడియోనిలయమునుండి ప్రసారితమైన ప్రసంగము 2-8-45]

# కవి - సమాజము



ఏ యుగములోనైన, నేదేశములోనైన కవి మాననీయుడే. కవి ప్రజాపతితో సమానుడే కాక యొక్కొక్క సమయమున నాతని మించునుగూడ. కవి తాను ప్రతిభాసంతుడై, త్రికాలవేదియై, సమస్త చరాచరప్రకృతిని నిశితముగా పరిశీలించి, తానందుండి విడిపోయి, దాని నాత్మతత్త్వముతో సమన్వయించుకొని యాధికారిక వచస్సును మధురముగా వెలువరించును. ఆతడు క్రాంతదర్శి. కావుననే కర్మసాక్షినికూడ త్రోసివైచి 'రవి గాననిచో కవి గాంచునేకదా' అనెడి లోకోక్తి పొసగినది. వర్తమానములో భూతభవిష్యత్తుల సమన్వయించుట ప్రతిభావిశేషమేకాని వేరుకాదు. దూరదర్శనములో లౌకికములైన, నిత్యనైమిత్తికములైనవిషయములను క్షాళనము చేసి యుత్తమోపదేశముచే సంస్కరించుటలో కవి ఋషితుల్యుడు.

కవికూడ లోకసంబంధియే. సామాన్య మానవుడే విధముగా నాహార విహారాదులలో పాల్గొనునో యట్లే కవియును. కాని కవి లోకానుభవమును పొంది, యా లోకములో తాను చూచిన సన్నివేశమును తన ప్రతిభచే నుదాత్తముచేసి, యందలి తాత్కాలికచేతనను క్షాళనముచేసి శాశ్వత స్పందనము నాపాదించును. కవి కార్యము విచిత్ర

మైనది. అసత్తునుండి సత్తునకు, తమస్సునుండి జ్యోతిర్లోకము నకు నడిపించు శక్తిమంతుడు కవి. సమాజములో సామాన్యులు చూచు దృశ్యమునే తానును దర్శించును. కాని సామాన్యులవలెగాక యతడందలి పాత్రములతో లీనమొందును. ఆ దృశ్య మాతని యంతరంగాభిత్తికయందు సంపూర్ణముగా ముద్రిత మగునట్లు సాధనము చేయుచుండును. పునర్దర్శనముచేసి దాని నంతరంగమందు భావనిగ్రహముచే నిలుపుకొనును. తనకు కలిగిన సంతోషము నానందముగను, దుఃఖమును కరుణముగను సంస్కారవిశేషముచే పరివర్తనము చేయును. అనగా కవి ప్రథమదశలో సాక్షియై, పిమ్మట ద్రష్టయగునన్నమాట. సామాన్య మానవులు సాక్షులుమాత్రమే.

కవి తాను దర్శించి నిగ్రహించి భావనచే దాని నొక రసగోళముగా పునర్దర్శించిన తరువాత యితరుల కారసానందానుభవమును భాసింపచేయుటకు ప్రయత్నించును; ద్రష్టయైన పిమ్మట స్రష్టయగును. అనగా కవిత సృష్టియన్నమాట. ఉక్తివిశేషమే కవిత్వ మన్నాడు ప్రాచీనుడు. ఉక్తివైచిత్రి పొసగుటకు కవి వ్యుత్పన్నుడు కావలెను; చూచిన సన్నివేశమును తిరిగి శబ్దార్థకల్పనముచే సృజింపవలెననిన నెంతటి శబ్దాధికారము వలయునో యూహింపుడు. శుద్ధమైన వచస్సుతో సమగ్రవస్తుచిత్రణముచేసి తా నెంతటి సానుభూతి పొందెనో యంతటి యనుభవము సామాజికునకు కూడ నందించినపుడే కవి కృతార్థుడగును. కావున కవి క్రాంతదర్శియై నిశితగ్రథనాకౌశలముచే స్ఫుటవ్యక్తికలిగి యుండవలెను. వ్యక్తిలేని ద్రష్ట ప్రయోజకుడు కాడు.

నాడు, కవి మానవ సమాజము నుత్తమమార్గమున తన పవిత్రవచస్సుతో నడిపించువాడు. జాతి సంస్కృతికి నుపాధ్యాయు డెంతటి బాధ్యత వహింపవలెనో యంత బాధ్యత మానవకల్యాణమునకు కవి వహించును. కవి సమాజమును తనతో తీసికొనిపోయి యాదర్శమూర్తులను చూపి, యలరించి, యనుసరింపజేయును. అట్టిచో సమాజముకూడ కవి నాదరింపవలెను. సామాజికులు కేవలము పామరులై కవి విశిష్టత యెఱుగక యాతని దూషింపరాదు. విద్యావంతులై వివేచనాజ్ఞానముకలిగి, సహృదయత్వ మలవరచుకొని సామాజికులు కవిని సమీపించుట కర్హత సంపాదించుకొనవలెను. కవి సామాజికు లీవిధముగా పరస్పరానుభూతి కలిగియుండిన గాని శోభ లేదు.

పూర్వకవులు చిత్రించిన సన్నివేశములు సమాజమునకు సహజములు కావనియు, వాస్తవిక జగత్తు నతిక్రమించి, భావాంబరవీథులలో విహరించుట దోషమనియు, యథాదర్శనముగా చిత్రింపవలెగాని సమాజమునకు దూరముగా నుండరాదనియు నిటీవల కొందరు వాదించుచున్నారు. కవిదృష్టికిని సామాన్యుని దృష్టికిని భేదమున్నట్లు తెలియవలెను. వాస్తవిక కథనముకన్న నుదాత్త కథనమే బోధనమున కనుకూలించును. లౌకికమునుండి యలౌకికమునకు పాత్రముల నడిపించుచు కవి సమాజమును స్వర్గమును కలిపి ముడివేయును. ప్రవరునివంటి యింద్రియ నిగ్రహము కలవాడును, సీతవంటి పతివ్రతయు లోకవిరుద్ధములని శంకిం

చువా రున్నారు. లోకమునకు కవిత్వము దర్పణమైనందు వలన ప్రయోజన మేమి? ఉన్నది యున్నట్లు వర్ణించుచో కవి యేల మనకు? అట్లు కవిత్వము దర్పణమైన, నుపదేశమునకు బదు లుద్రేకమును, సంస్కరణమునకుబదులు జుగుప్సను కవి కలిగించునేమో! కవి కేవల సామాజకుడైపోయిన ప్రయోజనము లేదుకదా. దేశకాల పరిస్థితులను గమనించియే ప్రతి యుగమున కవి ప్రవక్తయై ప్రవర్తిలుచుండును.

ఈ సిద్ధాంతమును మరచి సమాజమునకు కవి దూరముగా వర్తిలుచున్నాడను ప్రవాదము కొందరు లేవదీసినారు. ప్రజావాఙ్మయము పూర్వము లేదని వివదించుచున్నారు. ప్రజావాఙ్మయ మనగా ప్రజల కొరకు వాఙ్మయమని యర్థము. పూర్వమున్న వాఙ్మయము ప్రజలకొరకే కాని పశువులకు కాదుగదా యుద్దేశింపబడినది? ప్రజ లన్న పామరు లని యర్థము చెప్పుకొనినచో పామరునికి వాఙ్మయమాతని సంస్కరించి సన్మార్గవర్తనుని చేయుటకేగదా? విశ్వశ్రేయః కావ్య మనినపుడు పూర్వులు దీనినే యుద్దేశించినారు. కాని పూర్వకావ్యములు ప్రజల కందుబాటులో లేవని యందలి భాషాభావ జటిలత్వమును దూషించుచున్నారు. నేడు వ్యావహారికభాషలో కవులు తమ భావముల నందించినను ప్రజాసామాన్యమున కర్థమగుటలేదను వాక్యములు వినబడుచునే యున్నవి. సామాజికు లధికారానుగుణముగ విషయ గ్రహణము చేయవలెనే కాని కవిని దూషించి ప్రయోజనము లేదు. అన్ని కాలములలోను కవి

కిని పామరునికిని మధ్య సహృదయుడైన వ్యాఖ్యాత యుండవలెను; ఉండితీరునుగూడ. సామాజికుడు శిక్షపొందవలెను. అట్లు కాక కవిని పామరుని వద్దకు దిగిరమ్మనుట పొరపాటు. దీనినే రస్కిన్ పండితుడు—

"We neither feign nor interpret; you must rise to the level of our thoughts" ★

అని, సామాజికులే కవి వసించు నున్నత పథమునకు వెళ్ళవలెనుగాని కవి దిగిరాలేడని చెప్పినాడు. ఈ సిద్ధాంతమునకు విపర్యాసము కలిగినచో సమాజము తమోలోక మందుండుట తటస్థించును. జాతివ్యవస్థ క్షీణించిపోవును.

కవి భావోదాత్తతతో నే విధమైన వివాదము పనికిరాదు. కవితాభావమున కక్షర రమ్యత నాపాదించి దానిని కళామయము చేయుటలో సజ్జాద్ జహీర్ కూడ తన సమ్మతిని

The people demand of their artists to present these in artforms to clothe these sacred emotions...

అను వాక్యముద్వారా తెలిపినాడు; కాని వివదించలేదు. భావ చిత్రణములో కావ్యరూపము నంగీకరించితీరవలసిన దే.

కవికిని సమాజమునకు నవినాభావసంబంధము. కవి తానున్న దేశకాలపరిస్థితుల నాకళించుకొనియే కావ్యము రచించినాడు పూర్వము. నన్నయ కవితలో ధర్మనిష్ఠయు, పాల్కురికివారి కావ్యములలో శైవమతప్రాబల్యమును, తిక్కనార్యుని గంటములో దేశీయప్రభావమును, శ్రీనాథుని

★ Ruskins Lectures— Sesame.

క్రడాభిరామము:లో సంఘవ్యవస్థ, రాయలనాటి కావ్యములలో సమాజసౌఖ్యమును, వీరేశలింగము రచనలలో ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ సంఘర్షణము ముద్రితములైనవి. కావున నే సాంఘిక చరిత్ర వ్రాయుట కాసంఘవాఙ్మయము తోడ్పడు నను సూత్రము వచ్చినది. సంఘజీవితము ప్రతిబింబించని రచన యుండజాలదు.

నేడు ప్రబోధవాఙ్మయము వచ్చుచున్నదనిన, నది యీనాటి జాతియొక్క నిద్రాణావస్థను తెలుపును. ప్రబోధ వాఙ్మయమే సాహిత్యమని తలచుట యవివేకము. ప్రబోధ వాఙ్మయము తాత్కాలిక ప్రయోజనము గలది. ప్రజలను ప్రబోధించి యెన్నిదినములు కార్యశూరులుగా నిలువబెట్ట గలము? విజ్ఞానవ్యాప్తి విరివిగా జరుగవలెను. ప్రజ లందరు తమ విజ్ఞానపాదములపై తాము నిలువగల శక్తి యలవరచు కొనిననాడు కవి సందేశ మర్థమగుటయే కాక యుత్తమసాధ నములో శాశ్వతఫలము లందగలుగుదురు. విద్యావ్యాప్తికై పాటుపడక కేవల ప్రబోధము సాగించిన ముక్తి లేదు. విద్యా వంతునికి సాహిత్యము సమధికమైన జ్ఞానము నిచ్చి పరమా నంద సంధాన మొనగూర్చును. ప్రబోధము మనుజునిలో సహజమైన యూకాంక్షను పొడమనీయదు. కావున దాని ప్రభావ మల్పకాలపరిమితము. అయినను సాహిత్యసృష్టియు ప్రబోధవాఙ్మయ రచనయు నేకకాలావచ్ఛేదకములుగా జరుగవలసియేయున్నది.

ఈనాడు మన సంఘము దుస్థితిలో నున్నది. తుచ్ఛ కామమునకు గురియై జంతుప్రాయమగుచున్నది. వర్గమైన

నస్యములు మిక్కుటములై యైకమత్యము లేకయున్నది. అసూయాహంకారములు హద్దుపద్దులేక పెరుగుచున్నవి. ధైర్య పౌరుషము లడుగంటెనవి. సమాజములో శాంతిలేదు. స్వేచ్ఛాకాంక్ష ప్రబలినది. కాని ఫలవంత మగుటకు పరిస్థితులు ప్రతికూలములుగా నున్నవి. ఇట్టి సామాజిక దుస్థితిని సమగ్రముగా పరిశీలించి, విశ్వమానవకల్యాణము చేకూర్చు నట్టి, శాంతిని నెలకొల్పునట్టి, సంఘైకమత్యమును ప్రబోధించునట్టి యుత్తమ కవి యీనా డవతరింపవలసియున్నాడు. అతడు ప్రపంచ కవి కాగలడు. అతని అధికారికమగు ప్రవచనములతోడనే యీనాటి సామాజిక దుస్థితి తొలగిపోవును. ఆమహాకవి కొరకై నిరీక్షింతముగాత.



(5-6-1945 తేది హైద్రాబాదు రేడియోనిలయమునుండి ప్రసారితము)

# విమర్శకుడు - కళోపాసకుడు



విమర్శక కళోపాసకుల కర్తవ్యతాబాధ్యతలను వారి వారి ముఖ్యోద్దేశములకుఁ దోడగు వివిధోపాయములను, వారి యుత్కృష్టాదర్శములకు మార్గదర్శకములగు విషయములను తదితరవిషయముల నవగాహన చేసికొనుటకుఁ బూర్వము విమర్శనమనఁగ నేమియో, కళయనఁగ నెట్టిదో, యెట్టివాఁడు విమర్శకుఁడని, కళోపాసకుఁడని పిలువంబడెడినో యెఱుంగుట మన కవశ్యకర్తవ్యమై యున్నయది.

సూక్ష్మరీతిని బరిశీలించిన విమర్శకునికిని, కళోపాసకునికిని సన్నిహిత సంబంధ మున్నటుల దెలియనగును. నిజముగ కళోపాసన, కళాదృష్టి, కావ్యాదులయందుఁ ప్రవేశము గలిగియుండి, గొప్ప రసికుఁడైనవాఁడే విమర్శనాకార్యమునకుఁగాని, కళారాధనకుఁగాని గడంగుట కర్హుఁడగును. దీనిఁబట్టి విమర్శకునికిని, కళోపాసకునికి నొకే విధమగు పరికరము లుండవలయునని మనము దెలిసికొందుము. ఒక్కొక్కతఱిఁ గళోపాసకుఁడే విమర్శనకుఁ గడంగుట సంభవించును. కళోపాసకుఁడు కావ్యాదులం దగురీతిని బరిశీలించి, యందలి లోపాలోపములను గుర్తెఱుంగుట కెక్కుడవకాశమున్నది. తాను గుర్తెఱింగి, యితర జనంబుల కెఱుకచేయుటయే విమర్శనాదర్శకము. ఈ విధంబున విమర్శన కళోపా

సమాని కలముపై నాధారపడినదో గుణాగుణపరిశీలనముగా నెంచవచ్చును.

ప్రత్యేకముగా నీ రెంటినిఁ బరికింతముగాత! ఈ కార్యాచరణకుం గడంగుటలో రెంటికిని సాధర్మ్యవైధర్మ్యముల సులభమార్గముగఁ గన్గొన వీలగునను నాశయము ప్రబలియున్నది.

మున్ముందుగ 'విమర్శన' మన్న నెట్టిదో విపులముగఁ బరిశీలింతము. ఈ పదము ననేకు లనేక విధముల నిర్వచించి యున్నారు. ఎవరికిఁ దోఁచినటులు వారు వ్రాయుచుండ నేఁటికి విమర్శన మను పదమునకు భిన్నాభిప్రాయము లేర్పడి, విమర్శకుఁడన్న కేవలముఁ గావ్యములపట్ల రక్కసుఁడుగ భావించునంతటి భీతిని నెలకొల్పినది. నేఁడు ప్రతి విమర్శకుఁడును 'విమర్శన' మను పదమునకు భిన్నమైన నిర్వచన మొసంగుచున్నాఁడు. లక్ష్య మేదియు లేక, నోటికి వచ్చినటులు, కలము నడచిన రీతిని వ్రేలుచుండు విమర్శకు లనేకులఁ గాంచుచున్నారము. సంప్రదాయార్థములో విమర్శకుఁడు దోషాన్వేషిగా నెంచఁబడుచున్నాఁడు. కొందఱు కావ్యాదికళలయందలి గుణదోషవిశేషములను బరికించి, యున్నదియున్నట్లు దెలుపువాఁడు విమర్శకుఁడని యూహించుచున్నారు. మఱికొందఱు కృతియందలి విశేషములనే హెచ్చరించుచు, కవిని, కృతిని యథోచితముగ నభినందించుట విమర్శన మనుచున్నారు. ఒక వస్తువును గైకొని యందలి కవితామాధుర్యమునుగాని లేక రసోత్కృష్టతనుగాని,

చమత్కృతులను, తదితరాన్వయములను సహాయముగఁ గొని యితర వస్తువులను వీనితోఁ బోల్చి యేది మిన్నయో నిర్ణయించు తత్త్వమే విమర్శకతత్త్వ మని కొందఱు నుడువు చున్నారు. దీనికి సంబంధించిన వాక్యమే 'విమర్శన మొక యానుషంగిక పరీక్ష' యనునది.

విమర్శకుఁడు నిజముగా నిష్పక్షపాతబుద్ధితో నద్దేని పరిశీలింపవలెను. లేదేని యట్టిది విమర్శన మనిపించు కొనక, కేవలము కవిపైనున్న యభిమానమువలనఁగాని లేక యాతనిపై నిరసనభావమువలనఁగాని పురస్కరింపఁబడిన కలముయొక్క నడకగా నెంచఁబడును. బాగుగ పరికించిన నేఁడు వెలువడు విమర్శనములలో చాలవరకు నీ నిర్వచనము నకుఁ దోడగునవే యని గ్రహింపఁగల్గుదుము! ఒకానొకఁడు తన విమర్శనమం దొక కవిని, అతని కృతిని ఖండించినచో, నా కవిపైనున్న యభిమానముచే వేరొకఁడు దానిని తిరిగి ఖండి చుచు, మఱియొక విమర్శన మా విమర్శపై వ్రాయబూను కొనుట సామాన్యముగ మనము గాంచుచున్న విషయమే. తుదకీ విమర్శనలు వ్యక్తిగతములా కక్షల వెలిబుచ్చు మార్గ ములుగా నుపయోగింపఁబడు చున్నవి. క్రమముగ వ్యక్తిద్వేష మునకుఁ గారణభూతమై విషమపరిణామము నొందుచు ముఖోద్దేశమునకు దూరమగుచున్నవి. ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసియున్నది. విమర్శనము కృతుల కనువర్తించునదికాని కృతికర్తల కనువర్తించునది కాదని ప్రతి విమర్శకుఁడును గ్రహింపవలెను. కృతిలోనున్న గుణ దోషములఁ గాంచుటేకాని కృతికర్తల గుణదోషముల నెంచుట

విమర్శనాపద్ధతికి విరుద్ధము. నేఁటి విమర్శకులలోఁ గ పదులు దీనినే గ్రహింపలేకున్నారు. విమర్శకుఁ డెన్నటికిని కృతి కర్తపై తన కున్న యభిప్రాయము ననుసరించి యాతని కృతిపై తదభిప్రాయమే ప్రతిబింబించునటులు వ్రాయఁబూనకొనఁడు. 'Judge not others that thy be not judged' అను వచనము ప్రతి విమర్శకుఁడును గమనింపఁదగినది.

నిజమైన విమర్శనలోఁ గలహాములకుఁ గారణంబులగు విషయంబు లుండక 'విషయ విభజన, వ్యాకరణార్థపరిశీలన, నిరుక్తము, భావవ్యాఖ్యానము, పరిష్కరణ' మున్నగు నితర విషయములు చేరుచున్నవి. వీని నన్నింటియెడను కౌశలము వడసియుండువాఁడే సరియైన విమర్శకుఁడు. అనఁగ విమర్శకుఁడు సర్వతోముఖుఁడై విజ్ఞానసర్వస్వసాధకుఁడై యుండవలె నన్నమాట!

విమర్శనమందు చారిత్రక, శాస్త్ర, కావ్య విమర్శనము లని ప్రత్యేక విభాగము లున్నవి. విమర్శకులలో నిరు తెగ లున్నారు. ౧. ఉన్నదాని నున్నటులు విపులీకరించి యర్థమును (కవి తలంచిన రీతి) చెప్పువారు. ౨. ప్రత్యేక వాక్యములను, సందర్భములఁ గైకొని ఖండించువారు. విమర్శకులకు గర్వము హెచ్చఁగ నహంభావముతోఁగూడి, యున్నదాని విపులీకరించుటే యేమి ప్రయోజకత్వ మని తమ యభిప్రాయములఁ జొనిపి, పాండితీప్రకర్షకుఁ బ్రయత్నములు సల్పుచు ఘర్షణలలోనికి దిగుదురు. అట్టిచో వీరు రెండవ తెగలోనివారుగాఁ బరిగణింపఁబడెదరు. విమర్శనో

చమత్కృతులను, తదితరాన్వయములను సహాయముగఁ గాని యితర వస్తువులను వీనితోఁ బోల్చి యేది మిన్నయో నిర్ణయించు తత్త్వమే విమర్శకతత్త్వమని కొందఱు నుడువు చున్నారు. దీనికి సంబంధించిన వాక్యమే 'విమర్శన మొక యానుషంగిక పరీక్ష' యనునది.

విమర్శకుఁడు నిజముగా నిష్పక్షపాతబుద్ధితో నద్దేని పరిశీలింపవలెను. లేదేని యట్టిది విమర్శన మనిపించు కొనక, కేవలము కవిపైనున్న యభిమానమువలనఁగాని లేక యాతనిపై నిరసనభావమువలనఁగాని పురస్కరింపఁబడిన కలముయొక్క నడకగా నెంచఁబడును. బాగుగ పరికించిన నేఁడు వెలువడు విమర్శనములలో చాలవరకు నీ నిర్వచనము నకుఁ దోడగునవే యని గ్రహింపఁగల్గుదుము! ఒకానొకఁడు తన విమర్శనమం దొక కవిని, ఆతని కృతిని ఖండించినచో, నా కవిపైనున్న యభిమానముచే వేరొకఁడు దానిని తిరిగి ఖండి చుచు, మఱియొక విమర్శన మా విమర్శపై వ్రాయబూను కొనుట సామాన్యముగ మనము గాంచుచున్న విషయమే. తుదకీ విమర్శనలు వ్యక్తిగతమౌ కక్షల వెలిబుచ్చు మార్గ ములుగా నుపయోగింపఁబడు చున్నవి. క్రమముగ వ్యక్తిద్వేష మునకుఁ గారణభూతమై విషమపరిణామము నొందుచు ముఖ్యోద్దేశమునకు దూరమగుచున్నవి. ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసియున్నది. విమర్శనము కృతుల కనువర్తించునదికాని కృతికర్తల కనువర్తించునది కాదని ప్రతి విమర్శకుఁడును గ్రహింపవలెను. కృతిలోనున్న గుణ దోషములఁ గాంచుటేకాని కృతికర్తల గుణదోషముల నెంచుట

విమర్శనాపద్ధతికి విరుద్ధము. నేఁటి విమర్శకులలోఁ గొందఱు దీనినే గ్రహింపలేకున్నారు. విమర్శకుఁ డెన్నటికిని కృతికర్తపై తన కున్న యభిప్రాయము ననుసరించి యాతని కృతిపై తదభిప్రాయమే ప్రతిబింబించునటులు వ్రాయఁబూనికొనఁడు. 'Judge not others that thy be not judged' అను వచనము ప్రతి విమర్శకుఁడును గమనింపఁదగినది.

నిజమైన విమర్శనలోఁ గలహములకుఁ గారణంబులగు విషయంబు లుండక 'విషయ విభజన, వ్యాకరణార్థపరిశీలన, నిరుక్తము, భావవ్యాఖ్యానము, పరిష్కరణ' మున్నగు నితర విషయములు చేరుచున్నవి. వీని నన్నింటియెడను గౌశలము వడసియుండువాఁడే సరియైన విమర్శకుఁడు. అనఁగ విమర్శకుఁడు సర్వతోముఖుఁడై విజ్ఞానసర్వస్వసాధకుఁడై యుండవలె నన్నమాట!

విమర్శనమందు చారిత్రక, శాస్త్ర, కావ్య విమర్శనము లని ప్రత్యేక విభాగము లున్నవి. విమర్శకులలో నిరు తెగ లున్నారు. ౧. ఉన్నదాని నున్నటులు విపులీకరించి యర్థమును (కవి తలంచిన రీతి) చెప్పువారు. ౨. ప్రత్యేక వాక్యములను, సందర్భములఁ గైకొని ఖండించువారు. విమర్శకులకు గర్వము హెచ్చఁగ నహంభావముతోఁగూడి, యున్నదాని విపులీకరించుటే యేమి ప్రయోజకత్వ మని తమ యభిప్రాయములఁ జొనిపి, పాండితీప్రకర్షకుఁ బ్రయత్నములు సల్పుచు ఘర్షణలలోనికి దిగుదురు. అట్టిచో వీరు రెండవ తెగలోనివారుగాఁ బరిగణింపఁబడెదరు. విమర్శనో

ద్దేశ్యము గుర్తెఱింగి, తత్ప్రకృతుల నరసి, దాని కనువగు పరికరముల సమకూర్చుకొని తముద్యమమునకుఁ బూనుకొనిన విమర్శనము సార్థకనామముతోఁ బరఁగుననుట నిస్సందేహము. ఇట్లు సర్వలక్షణలక్షితుండై సకల పరికర సమన్వితుఁడై పరఁగు నాతని విమర్శన ముదాహరణాగఁ గైకొన సాహసింపవచ్చును.

విమర్శనమే ప్రత్యేక వాఙ్మయస్వరూపము దాల్చుచున్నది. గూఢార్థమును ప్రకాశింపఁజేయుట, ప్రజలకు కళాసౌందర్యమును వెల్లడించి, కావ్యాదులయందు, కళోపాసనలందు నభిరుచి యాదరణాభిమానము లేర్పఱచుట, విమర్శన యొక్క ముఖ్యాశయములు. కనుక విమర్శకుఁడు పైనుదాహరించిన పరికరములతోడను, మహదాశయముల తోడను, నిష్పక్షపాత బుద్ధితోడను, విషయవ్యక్తీకరణమే ప్రధానకర్తవ్యముగా నెంచుచుండాఁ గైకొనిన దానిలోని లోపాలోపముల నవలోకించి చదువరులకుఁ జూపుచుండవలెను. విమర్శనమని నామము బిఱుట కట్టితఱిగాని సమంజసముగాదు. లేనియెడల 'ప్రశంస' యనియో, లేక 'రంధ్రాన్వేషణ' మనియో, వారి వ్రాఁతలకు నామంబిడిన ఘర్షణకుఁ దావుండదు!

ఇఁక కళనుగూర్చి కళోపాసకులగుఱించి తెలిసికొన వలసియున్నది. ప్రథమమున 'కళ' యనుపదమును నిర్వచించి పిదప దాని వివిధశాఖలు, వాని నారాధించు పద్ధతులను గ్రహింతముగాక!

'Art is the presentation of real in its mental aspect'

అనఁగా జీవనసాదృశ్యముయొక్క మానసికరూప మును ప్రదర్శించుటయే కళ-అని యొక మహామహుఁడు సెల విచ్చియున్నాఁడు. చతుష్షష్టి కళలున్నటులు మనకు తెలియు చున్నవి. కాని వాని నన్నింటిని గ్రహింపఁగల్గునంతటి యవ కాశము మనకిచ్చుటలేదు. ఈ అఱువది నాల్గు కళలలోను లలితకళలుగా నెంచఁబడుచున్నవానిఁ గైకొని తగురీతిని బరిశీలింతము:-

కవిత్వము, చిత్రలేఖనము, తక్షణము, సంగీతము, శిల్పకళ, లలితకళలుగా నెంచఁబడున్నవి. మన భారతదేశ మున లలితకళలపైనున్న యాదరము, తత్కౌశౌన్నత్యము, నాఁటియేయితర దేశమందును గానుపించదు. హిందూదేశము శిల్పశాస్త్రములో నద్వితీయము, సంగీతములో సాక్షి, కవన మందుకన్నెఱ్ఱ. చిత్రలేఖనమందు చాతురీధురీణ. తక్షణములో తార. ఇట్టి యైశ్వర్యము లభింపఁజేసిన విశేషనైపుణీ ధురం ధరు లెందఱో మన భారతదేశము నాదర్శప్రాయముగాఁ జేసి నందులకు వారు వందనీయులు. అధునాతన యుగమున పాశ్చాత్య దేశములందు లలితకళల కెట్టి యాదరము కలదో యఁచుఁ గమనించినవారు, విదేశములందే పీవిజననమనియు, నచ్చటనే కళయౌన్నత్యము గడించినదనియు సరియైన పరా మర్శ లేక. యభిప్రాయపడుచున్నారు. యథాతథముగ, నే విజ్ఞానమును గైకొనినను పూర్వము భరత దేశమందు వరలి నదేకాని యన్యముగాదు. సంస్కృతము, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము, సాముద్రికశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, వేదాంతము, తర్కశాస్త్రము, వైద్యశాస్త్రము, తదితర

శాస్త్రములును- పైనుదాహరించిన లలితకళలు మొదలుగా గల వన్నియు, భారత భూమిలో జననమందినవే! నేటికి వాని నితర దేశంబులనుండి నేర్చుకొనుచుంటిమని, సర్వవిజ్ఞానము వారి ధనమే యని తలంచునంతటి దౌర్భాగ్యము కలుగు టింతయు శోచనీయము. ప్రాచీన విజ్ఞానమును విస్మరించు విన్యాసము వెల్లివిరియుట విచిత్రము గాకేమున్నది? మన ప్రాచీన శాస్త్రములను,సంప్రదాయములను,మరచియితరుల శాస్త్రముల నభినందించుచు, "పొరుగింటి పుల్లకూర రుచి" యన్న సామె తను నేటి భారతీయులలో నవనాగరకులమని గర్వపడువారు సార్థక పఱచుచున్నారు. నిజముగ్రహించిన మనము మన శాస్త్రములను నిల్పుకొనలేక, పఠింపలేక, యితరుల కందఁ జేసి, నేఁడుతిరిగి వానినే యితరులచేతను బోధింపఁబడవలసిన స్థితిలోనుంటిమికదా! ఏమి యీ వైధర్మ్యము!

ఇఁక నొక్కొక్క లలితకళను గ్రహించి ఒకనాఁటి తమ న్నతిని సంస్మరించి పరికింతముగాత!

౧. కవిత్వము: మనభారత దేశము కవనములోకన్నెజ్జ యంటిమి. నిజమున కంతియే. భావగాంభీర్యములందుఁ గాని భావార్థ ప్రకర్షణమందుఁగాని, రసికత్వమునఁగాని, నవీకపొం దికలోఁగాని, యలంకారపు టందమునఁగాని యితర దేశ ముల కవులు మన కవులతో సాటిరారు. శృంగార రసవర్ణ నలలో మన కవుల కవనములు సోపాన మెక్కినవి. కవిచమ త్కృతు లపూర్వములు. నవరసము లొక్కపరి చిప్పిలఁజేయు సమర్థతలో మనవారగ్రగణ్యులు. ప్రబంధరచనలు. ద్వ్యర్థి


సాహిత్య

కావ్యరచనలు మన కవివర్యుల మనంబులనే మొలకలెత్తి షేక్స్పియర్ వ్రాసిన 'మిడ్‌సమ్మర్ నైట్సు డ్రీము' 'కామెడీ ఆఫ్ ఎరర్స్' లను చూచి మన కవులను నిరసింపనక్కరలేదు. వానికి దీటుగ పింగళి సూరన మన కొసంగిన 'కళాపూర్ణోదయ' మున్నది. వర్డ్సువర్తునే ప్రకృత్యుపాసకుడని మన దేశపు నవనాగరకులు తలంపనవసరము లేకుండ, మన కవు లందఱు నట్టివారని నుడువుచున్నాను. ఇందులకు మనవారి ప్రబంధములలోని ప్రకృతి వర్ణనములే ప్రమాణములు. అంతవర కేల? వేదములయందే ప్రకృత్యుపాసనలు కుప్పతిప్పలుగ నున్నవి. కాళిదాసకవి ప్రకృత్యుపాసనమందేమి వ్యంగ్యప్రధానమగు శృంగార పోషణమందేమి యసమానుడు. కనుక ప్రాచీన కవుల కవనము లెట్లు నీతిబోధకములై, వర్ణనాపూర్ణములై; భగవద్భక్తినిఁ బురిగొల్పు విషయములతో వరలినవో, నేటికవులుగూడ ప్రాచీన సంప్రదాయముల వదలక క్రొత్త నడవడిక సులభమార్గమున, నుత్తమాశయములతో వ్రాయుచున్నారు. ఇహపరముల సాధించు సాహిత్యము భారతీయులదే కాని తదితరులది కాదు.

౨. చిత్రలేఖనము: హిందూదేశము చిత్రలేఖనమందు చాతురీధురీణ యంటిమి. ఈ వచన మూరక వ్రాసినది కాదు. నిజముగ నీ కళౌన్నత్యమును గమనింపవలెనని నిజాము రాజ్యము నందలి ఔరంగాబాదుజిల్లాలోఁ జేరిన 'అజంతా' చిత్రములే యుదాహరణంబులు. ప్రాచీనకళౌన్న

త్న్యమును, నైసర్గ్యమును ప్రజలు విస్మరించునట్టి దినంబు లేతెంచినను, ఆ చిత్రములు నేఁటికిని సజీవములుగ నుండి చెక్కు చెదరక నూతనము లేమో యని భ్రమింపఁజేయు చున్నవి. నిజముగఁ జిత్రరచన మనిన నానాఁటి చిత్రకారు లదే! చిత్రకళాపోషణ మనిన నాఁటి మహీశులదే! కళోపా సనమన్న నాఁటిదే! నిజముగ మనుష్యుని వర్ణించినంత, నా వర్ణనను విని చిత్రించునట్టి కళాకౌశలముగల చిత్రకారు లుండువారలు. చిత్రకళకు కావలసిన వస్తుసామగ్రిని స్వతము వారే నిర్మించుకొనెడివారు. ఆనాఁడుపయుక్తములైన వర్ణ రచనానైపుణికి నేఁటిశాస్త్రవేత్తలువిభ్రాంతి చెందుచున్నారు. ఆ వర్ణములు నేఁటివరకు ప్రత్యక్షముగనుండుట వారిని చకి తుల గావించుచున్నది. భారతీయ చిత్రరచనము ప్రపంచ విఖ్యాతి నందినది. అంగాంగీభావ నిర్వాహణమందు,వివిధభావ చిత్రణమందు, వెలుగునీడలయందు, అవయవసౌష్ఠవసౌకు మార్య వైవిధ్యవేదనమందు, సంవిధాన కల్పనమందు భారతీయ చిత్రకారులప్రతిమానవై లక్షణ్యమును ప్రకటించి చరిత్రలో శాశ్వతస్థాన మలంకరించినారు. ఆనాఁటి చిత్ర కారుల కళౌన్నత్యమును వెల్లడిజేయు 'అజంతా' చిత్రములు నేత్రోత్సవదాయకంబులు. ప్రాచీనకళౌన్నత్యమును ప్రజల కందఱకును జూపుటకొఱకై తగు సౌకర్యము లేర్పఱచిన మ. ఘ. వ. శ్రీనిజాంప్రభువుగారి నివ్వట్ల నభినందింపవలసి యున్నది.

3. తక్షణము: ఇందలి నైపుణ్యమును గ్రహింపవలె ననినఁ బ్రాచీన కట్టడములనే గమనింపవలెను. ద్వారము

లందును, ఊాతి స్తంభములమీఁదను గాననగు చెక్కడము లిప్పు డేరు ననుకరింపఁజాలరు. ఆనాఁటి యుద్ధములలో నుపయోగింపఁబడిన ఖడ్గముల పిడులపైనను, డాలులమీఁదను, కవచములపైనను గొప్ప తక్షకులచేఁ జెక్కఁబడిన పనితనము నేఁటికిని మనము వస్తుప్రదర్శనశాలలలోఁ గాంచగల్గుదుము. ఫిరంగిగొట్టములమీఁదను నాఁటి తక్షకుల నైపుణ్యము మెఱయుచున్నది. ఆ గొట్టముల ముఖములు ఏ సింహాతలాటముగనో, ఎద్దుతలగనో చెక్కినట్లు గానఁబడుచున్నవి. ఎల్లోరా గుహాలు మొదలైనవి మన తక్షకుల కళావైభవమును ప్రకటించునవి.

౪. సంగీతము: 'గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీత ముచ్యతే' యను శాస్త్రజ్ఞుల వాక్యానుసరణముగ సంగీతము గీతవాద్యనృత్యసమ్మేళనము. సంగీతమునే 'భరత' మని నుడువుటకూడ వినుచున్నారము. అనఁగా భావ, రాగ, తాళయుక్తమైనది సంగీత మని భావము. సంగీతము మన దేశమునకుఁ గ్రొత్తదికాదు. ఇది వేదకాలమునాఁటినుండి యున్నట్లు సామవేదమువలనఁ దెలియనగును. సంగీతమును తరణోపాయంబున కనువగునదిగా నెంచి, త్యాగరాజు, దీక్షితులు మున్నగువారు దానిం జేపట్టి స్థిరకీర్తిం బడసిరి. కర్ణాట సంగీత మని పేరుగన్నది భారతీయుల సంప్రదాయసిద్ధమగు సంగీతము. కర్ణపేయముగ నుండునదిగాన దానికీ పేరు సిద్ధించినదని పెద్దలనుచున్నారు. సంగీతమునకు దక్షిణ భారత దేశము ప్రఖ్యాతి నందినది. నాదబ్రహ్మ నుపాసించి యీ కళద్వారా మోక్షసాధనము జరిపిన యోగులున్నారు.

ఇష్టార్థముగ భగవత్సన్నిధిని జేర్చు నుపాయము మీ సంగీతకళ యందున్నట్లు మహానుభావులు దర్శించి ప్రతిపాదించి యున్నారు. త్యాగయ్య కీర్తనలు, కృతులు నేటికిని రసజ్ఞుల నలరించుచు నేయున్నవి

౫. శిల్పము: దీని యౌన్నత్యము ప్రాచీన దేవాలయాదులయందుఁ గాననగును. ఇందులకు మన దక్షిణదేశమే పేర్కొనదగినది. అమరావతి, నాగార్జునకొండ యిత్యాది చారిత్రకస్థలములలో నద్భుతమగు శిల్పసంపద కనుగొననగును. ఆంధ్రశిల్పకళా వైదగ్ధ్యము వేనోళ్ల చాటునట్టి శిల్పము లవి. శిల్పహృదయము నెఱిఁగి సానుభూతితోఁ దిలకించువారికి వీని ప్రత్యేకత పొడగట్టును. ఒక్క స్తంభములో శిల్పి చూపు పనితనమునకుగాని, ఒక కొండను శిల్పభవనముగా చిత్రించుటలోని కౌశలమునకుగాని యెవ్వరైనను జోహారు నర్పింపవలసినదే. ఇంతటి ఘనమైనది భారతీయ శిల్పము !

కళోపాసనముయొక్క ముఖ్యతత్త్వ మీశ్వరోపాసనమే. కళయొక్క పరమావధి భగవంతుని నిరూపించుటే. మనకు కళాపోషకు లత్యావశ్యకము. ప్రాచీన సంప్రదాయముల విస్మరింపక, యుదాత్తాభిప్రాయములతోడఁ బ్రాచీనులు చూపిన పథములనే పోవుచు నొకప్పటి భారతీయ ప్రతిభను, విజ్ఞానమును, కళౌన్నత్యమును సంస్మరించి వానిని పునరుద్ధరించుట యావశ్యకము.



[దివ్యవాణిలోను, ఏప్రిల్ 1940 భారతి లోను ప్రచురితమైన వ్యాసము]

# కవి - చిత్రకారుడు

వస్తుస్వరూప నిరూపణమందు కుంచెను బహు జాగరూకతతో నుపయోగించి, రేఖలు సరిగా వ్రాసి యెంతయో తబ్బిబ్బుపడుచుండుట చిత్రకారులకు సహజము. వర్ణముచే జీవము సద్భవలెనన్న బాహ్యసూక్ష్మముగా వానియెడ లోపము గానరాకుండునటుల కుంచెచే నద్దివ్రాసి సమగ్రముగఁ జేయును. వస్తునిర్దేశమందు ప్రవీణుడే నిజమైన చిత్రకారుడు. ఈ వస్తుస్వరూపనిరూపణ మెరయుటకు బుద్ధికుశలతయే ప్రథమ సోపానము. గాఢభావాకారమును గాంచి, దానిని మనకగపడునట్లు గ్రహింపుఁజేయుట కేవలము చిత్రకారుని యనుభూతిని సూచించును. ఒక చిత్రకారుని చిత్రము మెప్పునొసంగినదనిన నాతడు గొప్పవాడనియే తెలుపవచ్చును. కనుక రసమును వ్యక్తీకరించుటలో చిత్రమందు రౌద్రమును జూపిన సమంజసముగాదు. కొందఱు చిత్రకారులు వారి చిత్రపటముల ప్రక్కన నామం బిడుచుందురు. కాని వాని నామములు వ్యక్తీకరించు భావము లప్పుడపుడు గానరావు, నామం బిడుచుండుట యాచారమైనది. కాని 'నామము నా కొంపదీసె' నను లోకోక్తియు వినుచుందుము.

చిత్రకారు డెంతటి జాగరూకతతో మెలంగునో యదే విధముగ, లేక యంతకన్న నెక్కుడుగ శ్రద్ధ వహింపు

చుంచును కవి. ఈతని ముఖ్యాశయముగూడ వస్తునిర్దేశమే! కవి - చిత్రకారు లిరువు రొకే యాశయమునకై పనిచేయు చుందురు. ఒకరు గ్రహణశక్తిని నేత్రరూపమున గలుగ జేయును. వేఱొకరు శ్రవణరూపమున గలుగజేయును. ఇరువురును హృదయానందమును జేకూర్పవలెనను నభిమతముతోడనే కృషి సల్పెదరు. చిత్రకారుడు వ్రాసిన గీతలో జీవరేఖ యంతర్వాహినిగా బ్రవహించును. ముఖ్యముగ భావనలతో నవస్థావస్థలను గనిపెట్టి, రసానుభూతి పొంగి పొరలియుండుటకు జిత్రకారుడు పాటుపడును. కవి సముతి మాచితి యను వెలుంగు కరమున నిడికొని, యవస్థను తన్మ్యతిచే గమనించి, భావనాయంత్రముచే వస్తునిర్దేశము గావించును./ సాధారణముగా తాము లిఖించిన గీతములనుగాని, చిత్రములనుగాని జనావళిగాంచి, తా మేవిధములగు భావములందు వ్యక్తీకరించిరో యవే భావములను గ్రహించి, తా మే విధములగు నూహలను చదువరుల - లేక - చూపరుల మనంబులందు జనింపజేయ సమకట్టిరో యా యూహలే ప్రజల మనంబుల బ్రతిబింబితములైనయెడల గవియొక్కయు చిత్రకారునియొక్కయు నభిమతములు సఫలీకృతములయ్యె నన్నమాట!

✓ కవి యొక పాత్రను ధీరోదాత్తునిగ బోషించుచు, తుద కా భావమునుండి తొలగింపజేసి రసాభాసము గలుగ జేసిన నాతని పాత్రపోషణ మనౌచితి యను మృత్యువాత బడినదాను. చిత్రకారుడు సైతము సింహమును దానితోకపై నక్కయున్నటుల జిత్రించిన నసంభావ్యమగును! రెండవ

విషయ మనస్థానుగుణముగ లిఖించుట. ఉదాహరణముగ కవి యవస్థానుగుణముగా లిఖింపనిచో నెట్లుండునో చూతము: రాముడు సీతను విపినంబుల డించిరమ్మని లక్ష్మణుని కాజ్ఞాపించుచు, మరల జానకితో కలియుటయో, 'అయ్యో! విడవలసివచ్చెనే' అని విలపించుటయో చేసినట్లు చిత్రించినచో నది కేవల మవస్థానుగుణము.

తదితర లలితకళలకువలెనే కవిత్వ చిత్రలేఖనములకు చూడ ప్రజల నైతికాధ్యాత్మికాభ్యున్నతియే లక్ష్యము. అందుచే కవి యెల్లకాలము నొకేవిధముగ నుల్లసిలుననుట యసంగతము, అవి దేశకాల పరిస్థితులబట్టి వివిధములై, యా యా దేశీయుల నైతికాధ్యాత్మికావస్థలనుబట్టి మారుచునే తదభ్యున్నతిని కలుగజేయును. అట్లే ప్రాచీనయుగములందు ప్రజల విజ్ఞానావస్థ వ్యక్తమానటుల సంస్కృతకావ్యములకు ప్రాముఖ్యతయుండెడిది. ఆంధ్రులలో రానురాను సంస్కృతకావ్యములపై నభిరుచి సన్నగిల సంస్కృతపదభూయిష్టములగు తెలుగు కావ్యములు బయలువెడలెను. మఱికొంతకాలమునకు జాను తెనుగు కావ్యముల కాదరము మెండయ్యెను. కడపట నధునాతనయుగమున వ్యవస్థాంతరమును తెలుపదేటలగు చిట్టిపొట్టి కైతలకును, ఛందోనియమమంతగా లేని భావగీతములకును ప్రాముఖ్యత ప్రబలెను. అది యీనాటి వారి విజ్ఞానావస్థను దెల్పును. వారు మహత్తర కావ్యములలోని (ఛందోబద్ధ) మహదాశయముల నర్థము చేసికొనలేకపోయినప్పటికి 'ఎంకి పాటలలో' సువ్యక్తములగు మధురాశయముల నవగతము చేసికొనగల్గుదురు. భాషా

యోష శాస్త్రచోదితాచారముల నతిక్రమించి, 'విటురాలి విధమున వెడలె' ననుట కవితలోని యుత్కృష్టభావముల, నున్నతాశయముల గ్రహింప నేరమికి దార్కాణము. పతితు లగువారిని బైకెత్త కవితావధూటి చేయూతనొసంగుటకై నడుము వంచిన మాత్రమున నాపె గౌరవహీన గానేరదు. ఆమెను పతిత యనువారు భాషాబహిష్కారమున కర్హులు.

అవ్విధముగనే ప్రాచీనయుగముల వర్ణచిత్రముల యున్నతాసన మీనాడు రేఖాచిత్రముల కొసగబడినది. ఇది భావవిహీనములనిగాని, నియమరహితములనిగాని యనుట సమంజసముగాదు. వర్ణచిత్రములకు వర్ణములు, కుంచె మొద లగు పరికరములు గావలె. కాని, రేఖాచిత్రములకు లేఖని, ఫలకము లుండినజాలును. ఒక వర్ణ మొక్కొక తావునందు దద్దిన నెంత గంభీరముగానుండునో యటులనే నవయౌవ నుడౌ పురుషుని చిత్రమునం దొక రేఖచే ముదుసలిగా జేయ గల శక్తి రేఖలో నున్నది. కనుక ప్రాచీన కవిత్వమందును, చిత్రలేఖనమందును మార్పు కలిగినది. ఇది కేవలము కాలాను గుణమగు మార్పని మనము తెలిసికొనియే యున్నాము.

దేశీయులకు రాను రాను కాలముయొక్క విలువ తెలియుచున్నది. పెద్దపెద్ద ప్రబంధములుగాని, గ్రంథములు గాని, చూచి చదువునంతటి వ్యవధియున్నటుల గానరాదు. కనుకనే భావగీతముల కాదరణము గలుగుచున్నది. ప్రజ లకు సౌకుమార్యము ప్రబలినది. గంభీరములగు వానిని జూచు నంతటి - లేక - ఎదుర్కొనునంతటి ధైర్యము లేదు. పెద్దన

వ్రాసిన మనుచరిత్రము నామమాత్రముగ చదివి యానం దించిన మానవులెందరో చూచిన నొకలెక్కకురాదని చెప్ప వచ్చును. ఎందుచేత? రసార్ద్రములైన ఘట్టములవలనకే జనుల యానమము! అప్పటికిని మధ్యలో 'అటజని కాంచె భూమిసు రంబరచుంబిశిరస్సరజ్ఝరీ, పటలముహుర్ముహుర్'' అని వచ్చి వదలి వేయుటయే! వదలివేయుటయే కాక, 'నారికేళ పాక మేమిటోయి' అను మాటలలో తూలనాడెడు రాకవిత్వ మును కొందఱు. అట్టి పరిస్థితులలో భావగీతము లుత్పత్తిల్లి వీరి లోటును దీర్చి మెప్పును బడసినవి. అటులనే ప్రాచీన చిత్రముల నుండు వర్ణములను జూచి యసహ్యపడునట్టి నాకమార్గ్య మేర్పడినది. దీనిబట్టి కవి, చిత్రకారులు కాలానుగుణముగ, ప్రజాభిరుచినిబట్టి ప్రజల నైతికాధ్యాత్మి కాభ్యుదయమునకై పాటుపడుచుందురని గ్రహింపవలయును.

కవియు జిత్రకారుడు నొకే యాశయముపై ద్వివిధము లగు కార్యముల నెరవేర్చుచున్నారని యెఱింగితిమిగదా! కవియొక్క కథలనైనను, గీతములనైనను చిత్రరూపమున వెలిబుచ్చు. చిత్రకారుడు గ్రహణశక్తికి తోడ్పడును. అట్టి తెలిసి కవియు చిత్రకారుడైనచో వస్తునిర్దేశ మెక్కుడుగ రాణించునుగదా! అనగా కవితా చిత్రలేఖనము లను రెండు కళ లోకేవ్యక్తికి కలవడినచో దాను చెప్ప దలచిన దాని రెండు విధముల నాతడే వ్యక్తీకరించును. దీని కుదాహరణములను చూచినచో కవితకును చిత్రలేఖనమునకును సన్నిహిత సంబంధ మెంత యుండునో గ్రహింప వీలగును. కవికిని చిత్ర కారునికి తోడ్పడు ప్రకృతికిని కవితా చిత్రలేఖనములకునట్టి

సంబంధ మున్నదో యూహింతురుగాత. అరుణోదయమును కవివర్ణించును; చిత్రకారుడు చిత్రించును. ఈ చిత్రము లొక్కనే గీతము నుంచిన పరస్పర సోహదభూతములై కవికృ భావ మును సులభముగ వ్యక్తమగుటకు వీలగును. ప్రకృతి కవి కుమారునికి చిత్రకారునకు నెంత సహాయకరముగు వస్తువో తెలియును. సాధారణముగా కవి చిత్రకారులకు పరిసర దృశ్యములు తమ కృతుల ప్రేరకములుగా పరిణమించుచున్నను. కావున లలిత కళోపాసకులు ప్రకృత్యుపాసనము ప్రథమ కర్తవ్యముగా నెఱుగవలెను. ప్రకృతి ప్రభావ రహితమైన చిత్రకావ్యములు నిర్జీవములే.



(10-8-38 తేదీ ఆంధ్ర వారపత్రికలో ప్రచురితము)



# పదకవిత్వము *

## ౧

కవిత్వము లలితకళ లన్నిటిలో నగ్రస్థానము వహించు చున్నదని పండితుల సిద్ధాంతము. సంగీతములో నున్న హృదయద్రవీకరణశక్తిని, చిత్రలేఖనమందలి రూపకల్పనము, నాట్యమందలి చేష్టావైచిత్రుల నిముడ్చుకొని భావనాత్మకమై కవిత యొప్పారును. కవితలో చిత్రితములైన పాత్రములు చిత్తరువులలోవానివలె గాక సచేతనములు. అవ్యక్త మధుర గీతి యంతర్వాహినిగా కవితలో ప్రవహించుచుండును. దీనిని గమనించియే కార్లైలుపండితుడు కవిత గీతాత్మకమైన భావమని నిర్వచించినాడు.[1] ఇట్టి కవిత్వమునకు భావ వస్తు రచనలు ప్రధానాంశములు. వీనిలో దేని ప్రభావము మిక్కుటమైన దానిపేర కవిత్వము బరగుచుండును. అట్లు వచ్చినవే భావకవిత్వ, వస్తుకవిత్వములు. రచనలో శబ్దార్థములే ప్రధానములు. మధురమంజులగానయోగ్యమైన యక్షరములకె మైత్రికల్పించుట రచనమందలి విశిష్టగుణము. రమ్యాక్షరాపచయము, శ్రవణానంద కల్పనము లొనర్చుట కవి కార్యము. ముఖ్యముగా పదకవిత్వమం దీవిధమైన రచనా

---

* జూన్ 1945 లో రచితము.

1 Poetry we will call, musical thought.

సౌందర్య మొలుకుచుండును; శ్రవణసుఖమునిచ్చుచు, హృదయమును ద్రవీభూత మొనర్చి మానవుని సంస్కరించును.

పదకవిత్వము మాత్రాఛందము కలిగి, శబ్దకాఠిన్యము లేక సరసమగు పదములతో కూడి, గానయోగ్యమై, రాగరంజితమై, జాతీయాచార వ్యవహారములకు ప్రతిబింబమై, చక్కని నానుళ్లకు బలుకుబళ్ల కాశ్రయమై, మానవుల కష్టనిష్ఠూరముల మరపించునదై, పండిత పామరరంజకమై వర్తిలునది. జాతిప్రబోధమునకు నుద్దీపనమునకు నీ పదకవిత తోడ్పడుచుండును. ఇట్టికవిత ప్రతి భాషావాఙ్మయము లో నుండును. కాని తెలుగు పదకవిత కొక విశిష్టత యున్నది. సహజసారళ్య సంశోభితమును, మృదు మధురగాన యోగ్యము నగు తెలుగు పదములలో నాదసౌందర్య మున్నట్లు తెలిసికొందము. పాశ్చాత్యులు సైతము మన భాషను మెచ్చుకొనిన కారణ మిదియే ! [1]

మన దేశములో పద కవిత్వ మనాదిగా, ననుస్యూతముగా వర్తిలుచునే వచ్చినది. ప్రాక్తన మానవుడు ప్రకృతి శోభను పరవశుడై యనిర్వచనీయమగు నానందమును పొందియుండును. తన మనో భావమును ప్రదర్శించుట కాతడు చిందులు త్రొక్కి చప్పట్లను చరచి, శబ్దరహితమైన నాదమాధుర్యము నందించియుండునని భావింపగలము.[2] అజ్ఞాతావస్థలోని మానవుని మనసుపరిశీలించిన శిశుమానసమువలె, నవనీత

---

1 Telugu is the Italian of the East.

2 Moulton's Theory.

సదృశమైన దని తత్త్వజ్ఞులు చెప్పుదురు. శిశువు పొందు లయానందమును పై విధముగనే ప్రదర్శించునట్లు ప్రత్యక్షముగా చూడగలము. సృష్ట్యాదినుండియు నిశిత నిర్భరమా మానవుని భావానుభవము లయాన్వితమైన భాషలోనే వ్యక్త మగు చుండుట తథ్యము.★ ఈధర్మానుగుణముగనే వాల్మీకి శోకము శ్లోకత్వ మందినది. ఈ విధముగా నుద్భవించిన గీతి యుద్రేక పూరితమై యుండి రాగ రంజిత మగును. ఇట్టిగుణము పద కవిత్వములోనే యుండుట కెక్కు డవకాశమున్నది కాని పద్యములో నుండుటకు వీలు లేదు. పదకవిత్వ ముద్రేకోత్సాహ ప్రేరితములగు కర్తృభావములు కలదగుటచే పఠితృ శ్రోతృ హృదయములలో నాభావములు సూటిగా వెడలి, నిశితముగా నాటుకొని, వేగముగా నుద్దిష్ట రసానుభూతి పొందించును. ఇంత త్వరితముగా బోధించు గుణము మాత్రా ఛందముల కున్నంతగా గణఛందముల కేలనో లేదు. ఇది పదకవిత్వమున కున్న విశిష్టగుణము.

ఈ విధమైన పదకవిత్వము రాజాస్థాన గౌరవము పొందదు. పొంద లేదని విచారమక్కర లేదు. రాజసభలలో నంతయుకృత్రిమవాతావరణము. అందాదరముపొందుకవులు, కవిత్వము కూడ స్వేచ్ఛారహితమై రాజుల కనుసన్నల మెలగుచుందురు. కాని పదకవిత్వము ప్రజాసామాన్యము పాలిటి పెన్నిధి. రాజాదరణముతో దీనికి నిమిత్తము లేదు.

---

★ Ever since man has been born, all deep and sustained feeling is seen to express itself in rythmical language.
— S. Mill.

ప్రజలకానందముచేకూర్చి, వారిచేమన్ననలు పొందుచు, వారిని నిరాడంబర జీవులుగా, తేజో మూర్తులుగా, నుత్తమ శీలురుగా సంస్కరించుటే దాని యుద్దేశము. ఈపదకవితానిర్మాతలుకూడ ప్రజాదరణమునే వాంఛించిరిగాని రాజాజ్ఞలకులోబడినట్లు గాన్పించరు. అట్లు కానిచో వారికవితలో నంతటి యుదృతముస్వచ్ఛస్వతంత్ర భావములుండుట కవకాశమెట్లు పొసగును? ఈపదకర్తలు కీర్తికాములు కారనియు, స్వేచ్ఛాజీవులనియు, సున్నిత హృదయులనియు, ముముక్షువులనియు, వారి వారి రచనలనుబట్టి తెలిసికొందుము. అనేక ప్రాచీన పదములకు కర్తలెవరో మనకు తెలియుటలేదు. కాని యీ పాటలుమంచి ప్రచారము నందినవిగా చూతుము. ఇందు వారి స్వార్థరహిత బుద్ధిని, పరార్థ సేవనుమనము మూడ గల్గుదుము. ఈ పదకవిత్వ మింత కాలము ప్రజల నాలుకలపైననే వర్తిలుచు ప్రాచుర్యము పొందుచున్నదనిన నా కవితా ప్రభావ మెంతటిదో గదా!

తదితర దేశములవలెగాక భారతదేశము ప్రధానముగా వ్యావసాయిక దేశము. పనిపాటలవా రీదేశమం దెక్కువగా నున్నారు. యంత్రయుగము రాకపూర్వము పనివారల కలసట కలుగకుండ నీ పదకవిత వారికి నుత్సాహ మిచ్చుచుండెడిది. మన కీనాటికిని పల్లెలలో నీ విధముగా పదకవిత యుపయోగపడుచుండుట గాంతుము. పాశ్చాత్య దేశములలోవలెగాక మన దేశములో పారలౌకిక చింతయే ప్రముఖమై యొప్పారునది కావున మన దేశ కవిత్వములో

ఆధ్యాత్మిక [illegible]
లలో ప్రవహించు నదీనదములు పూ ఫల లతాదులతో శోభితమగు వనములు, సముద్రతీరములు, ఉద్యానములు, పర్వతశ్రేణులు, కీర కేకికాది విహంగరుతములు భారతీయ ప్రకృతిలోనివి. పాశ్చాత్యులకీవిధమైన సహజ ప్రకృతిశోభ లేదు. ఈ ప్రకృతిశోభ భారతీయ కవిత్వములో ప్రతిబింబించుచుండును. పదకవిత్వములో శృంగారగీతములు ప్రకృతి ప్రభావములే. ధైర్యపౌరుషములలో భారతదేశము ప్రశస్తి జెందినది. అనేక వీరులసమానముగా రణరంగమున పోరాడి మృతజీవులైనారు. కవితలో నీ విషయమును స్థానము గొన్నది. ఈవిధముగా భారతదేశము సార్థక్యము కలది. తదనుసారిగా కవితకూడ తదితర దేశముల కవితకన్న విలక్షణమైనది. ప్రకృతి సౌందర్యము, తత్త్వజిజ్ఞాస వీరగాథలు భారతదేశపు స్వత్వములు. ప్రాచీన పదములను పరిశీలించినచో వీర, శృంగార, తత్త్వపరములుగా నున్నట్లు కన్పించును.

మన పదకవిత్వములో నుపాదేయమగు మాత్రాఛందస్సు దేశీయమైనది. తదితర గణ ఛందస్సులవలె సంస్కృత లక్షణానుసారి కాక ఇది విలక్షణమైన తెలుగువారి సొమ్ము. ద్విపదలు, త్రిపదలు, చౌపదులు, షట్పదులు, రగడలు, అక్కరలు మొదలైనవి దేశీయ ఛందస్సులు. ప్రాచీన పదకవిత్వమంతయు వైవాసియందే చెప్పబడినది. కీర్తనలు, దరువులు, పాటలు, పదములు, గేయములు, గీతములని యీ పదకవిత్వములో ననేక తరగతులకు చెందిన రచన లున్నవి. వీనిని పాడుటకు ప్రత్యేక ఫణితులు, నియ

మిత సమయములు, కొన్ని వృత్తిసంఘము లుద్దేశింపబడినవి. అనాదినుండి యీ పదకవిత్వమును మన దేశీయులు తమ తమ వంశపారంపర్యముగా నందించుకొనుచు వేదములవలె భద్రపరచినారు.

ఆంధ్రసాహిత్యచరిత్ర నవలోకించువో నీ పదకవితా ప్రశంస యందందు కన్పించుచున్నట్లు తెలియుచున్నది. పండ్రెండవ శతాబ్దమునాటికి మన సాహితీప్రపంచములోనికి శైవకవులు ప్రవేశించినారు. వీరు భాషావిప్లవము తెచ్చిపెట్టినారు. ప్రజలలో వీరశైవమత వ్యాప్తి కలిగించుటకు కావ్యమును చేపట్టినారు. సంస్కృతపదభూయిష్ఠ రచన ప్రజలకందుబాటులో నుండదని 'జానుతెనుగు' భాషలో వ్రాయ మొదలిడినారు. వృత్తములకు బదులుగా దేశీయఛందమైన ద్విపదలో కావ్యముల వ్రాసి, మతప్రచారమునకు దేశీయ ఛందస్సు, వ్యావహారికభాష లత్యంతోపస్కారములని కని పెట్టినారు. ★ శైవపరములైన గీతము లనేకము లల్లబడి శ్రీశైలము వెళ్లు యాత్రికులవలన, భక్తులవలన ప్రాచుర్యమందినట్లు పండితారాధ్యచరిత్రలో వ్రాయబడినది. తుమ్మెదపదములు, నివాళిపదములు, ఫాలేసుపదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, సెజ్జవర్ణనపదములు మున్నగున వెన్నియో భక్తులచే పాడబడుచుండెడివట!

★ 'ఒప్పదు ద్విపద కావ్యోక్తి నా జనదు, అరూఢ గద్యపద్యాది ప్రబంధ, పూరిత సంస్కృతభూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుగు విశేషము ప్రసన్నతకు'

తరువాత కాలములో రంగనాథుని రంగనాథరామాయణము ద్విపదకావ్యముగా వెలసి 'తోలుబొమ్మలాట' ద్వారా ప్రజల కందుబాటులోనికి వచ్చినది. ఇట్లేగౌరన రాఘవార్యుల హరిశ్చంద్ర, నలోపాఖ్యానములు ద్విపదకావ్యములుగా నవతరించినవి. శ్రీనాథుడు పదకవితను ముదిలంజతో [1] పోల్చి హాపించినను పల్నాటివీరచరిత్రమును ద్విపదకావ్యముగా నిర్మించి పదకవితావాఙ్మయములో శాశ్వతస్థానము నలంకరించినాడు. సమాజములో భావావేశము ప్రేరించు సన్నివేశములు పదకవితావస్తువుగా పరిణమించి జాతి నుద్బోధించుచుండును. ఇట్టివే కాటమరాజుకథ, బాలనాగమ్మకథ, కామమ్మకథ మొదలైనవి.

పదునారవ శతాబ్దమునాటికి ప్రబంధప్రక్రియకు గౌరవము హెచ్చినను పదకవిత వర్ధిలుచునే వచ్చిన ట్లాకాలమునకు జెందిన తాళ్లపాక చిన్నన రచించిన వేంకటేశ్వర స్తుతి పదములు, ద్విపదరచనలు [2] ఋజువుపరచును. కందుకూరి రుద్రకవి [3] కూడ నష్టపదులు రచించి పదవాఙ్మయమునకు నివాళిపట్టినట్లు తెలియుచున్నది. ఇట్లే రాయలకాలమందును పదకవిత వరలినట్లును, ప్రబంధమం దాదరముచేనది మరుగుపడుచు వచ్చినట్లును కన్పించును.

---

1 'ముది'విటులు విధవలంజలు
పదకవితలు............:

2. దీని నంతటిని సంపుటములుగా శ్రీ తిరుపతి దేవస్థానమువారు ప్రచురించుచున్నారు.

3. కొందరీతని నాయకరాజుల కాలములోనివాడని చెప్పుచున్నారు.

పిమ్మట పదునేడవ శతాబ్దములో నాయకరాజుల పరిపాలనక్రింద గీతికి నాదరము మెండాయెను. గేయవాఙ్మయము విరివిగా పెరిగినది. యక్షగానము లుద్భవించి మాత్రాఛందస్సున కవకాశము మిక్కుటముగా నిచ్చినవి. సంగీతమునకు రాజాస్థానములలో నత్యంత గౌరవము లభించిన దినములవి. శహాజీకాలములో తిమ్మయ ద్విపద భారతమును రచించినాడు. తరువాత శరభోజీకాలములో (1711-28) త్యాగరాజు భక్తిపారవశ్యమున కీర్తన లనేకము రచించియున్నాడు. విజయరాఘవనాయకుని కాలమునకు జయదేవుని గీతగోవింద పద్ధతిని క్షేత్రయ తన పదములను రసవంతముగా నల్లినాడు. ఇవి రాధాకృష్ణుల శృంగారమును వర్ణించునవై నేటికిని ప్రచారములో నున్నవి. తరువాత దీక్షితులు, శ్యామశాస్త్రులు మొదలైనవారు త్యాగరాజు ననుసరించి, తరంగములను, కీర్తనలను రచించినారు. ముద్దుపళనికూడ రసవంతముగా సప్తపదులను వ్రాసినది. మొత్తముమీద తెలుగుతీయదనము, నాదగౌరవములు నాటికవులు తిన్నగా తెలిసికొని తమపదములలో దిద్దినారని చెప్పవలెను.

తరువాతకాలములో పదకవిత్వ మపరిమితముగా వృద్ధిపొందినది. అధ్యాత్మరామాయణ కీర్తనములు, రామదాసు కీర్తనములు, స్త్రీలపాటలు, భజన కీర్తనములు, తత్త్వగీతములు మున్నగునవి యెన్నియో రచింపబడినవి. పదకవిత్వములో స్త్రీల పాటలు విలక్షణమైన స్థానమును వహించును. మన జాతిజీవనమంతయు నందు ముద్రితమైనట్లు గ్రహింపగలము. జోలపాటలు, తలుపుదగ్గర పాటలు, మంగళహారతులు మేలు

కోలుపులు, వరసపాటలు, లాలిపాటలు, నలుగుపాటలు, బూజంబంతిపాటలు, చెండాటపాటలు, ఒప్పగింతలపాటలు, మొదలైనవి జాతీయ జీవనమునకు ప్రతిబింబములు. ఇవిగాక అక్కలపాటలు, నాగారుబొమ్మపాటలు మొదలైనవి తెలుగు వారి యాచార వ్యవహార నమ్మకములను చాటుచుండును. వీనిని పురుషులేకాక స్త్రీలుకూడ నెందరెందరో రచించినారు. ఊడుపుపాటలు ,నూర్పిళ్లపాటలు, దంపుళ్లపాటలు, పడవ పాటలు మొదలైనవి నేటికిని ప్రచారములోనుండి వ్యావసాయిక జీవితమును చాటుచున్నవి. పోతులూరి వీరబ్రహ్మంతత్త్వ ములు, 'జీవా' అనియు 'మనసా' అనియు 'చిలుకా' అనియు మకుటముగల తత్త్వగీతము లనేకము లున్నవి. తులసిపాటలు దండకములు, గోవిందనామాలు మొదలైనవి భక్తిపరము లైనవి కలవు. బుడుబుక్కలపాట, గంగిరెద్దుపాట, గొబ్బిపాట, బతకమ్మపాట మున్నగునవి కొన్నికాలములందే పాడుట విన్పించుచుండును. దాగుమూతలు, వెన్నెలకుప్పలు, చెమ్మ చెక్కలు, గుడుగుడుగుంజం, కాళ్లాగజ్జ,కోలాటము మొదలైన యాటలాడుచు పాటలుపాడుకొనుట యాంధ్రబాలికా సంప్ర దాయము. ఊర్మిళాదేవి నిద్ర, సీత సీమంతము, లక్ష్మణదేవర నవ్వు, లంకాయాగము, కుశలాయకము, సత్యభామ సరసము, ద్రౌపది వస్త్రాపహరణము మొదలైనపాటలు మన పురాణాది గ్రంథములలోని విషయములను పురస్కరించి వ్రాయబడినవి. ఇవి స్త్రీలను విజ్ఞానవతులుగా జేయు తలంపుగల యిటీవలవారి యత్నఫలము. దాసు శ్రీరామపండితుడు జావళీలు, కీర్తనలు రచించి ఖ్యాతి వడసినాడు. తురగా వెంకటరామయ్య,

గాలి సుబ్బారాయుడు, పుసులూరి సుబ్బారాయుడు, వెంకమాంబ, నరసమాంబ, రామలక్ష్మమ్మలు ఇటీవలి పదకర్తలలో కొందరు.

ఈ శతాబ్దములో పదకవిత్వమున కెన్నడు లేని యాదరము చేకూరినది. ఆంగ్లసాహిత్యావలోకనము వలన మొదట మన సంప్రదాయమును నిరసించినను, తరువాత క్రమముగా స్వీయసంస్కృతిపై ప్రత్యయము హెచ్చినది. దేశీయవస్తువులపై నభిమానము జనించినది. ఆంగ్ల జాతీయమైన మాత్రాఛందమునకు, జాతీయ నుడికారము కలిగిన వ్యావహారిక భాషకును గౌరవ మభివృద్ధిజెందినది. తత్పరిణామమే గేయ కవితావిర్భావము. మన ప్రాచీన కవితాచరిత్ర, జాతిజీవనము, సంప్రదాయములను తెలిసికొనవలె ననెడి యాకాంక్ష పొడమినది. తన్నిమిత్తము పరిశోధనలు జరుగుచున్నవి. ఇది శుభసూచకమే! ఈ శతాబ్దములో కవులు గేయములు వ్రాయుచున్నారు. దేశభక్తి ప్రబోధక గేయములను వ్రాసినవారిలో శ్రీయుతులు గరిమెళ్ల సత్యనారాయణ, మంగిపూడి వెంకటశర్మలను పేర్కొనితీరవలెను. ప్రణయపరముగా శ్రీ నండూరి వెంకటసుబ్బారావు రచించిన "ఎంకిపాటల" కున్న గౌరవ మింతింతని చెప్పలేము. భక్తిగీతములు హరినాథ సాయిబాబాల పరముగా వెలువడుచున్నవి. శ్రీ పెండ్యాల సీతారామయ్య పేర్కొనదగినవాడు. నవ్యులలో అడివి బాపిరాజు, కీ.శే. బసవరాజు అప్పారావు, కవికొండల వెంకటరావు, చింతా దీక్షితులు ప్రభృతులు పదములను రచించి ఖ్యాతి గడించుచున్నారు.

సాహిత్య

పదకవిత్వ మీవిధముగా మన సాహిత్యములో ననాదిగా వర్తిలుచు ప్రజల నానుభూతి పొందుచున్నది. దీనిని పిచ్చుకుంటలవారు, జంగములు, గొల్లలు, చెంచువారు, పగటివేషధారులు, దాసరులు, మున్నగువారు వృత్తిసంఘములుగా చేసి పదకవిత్వమును ప్రధాన్యముగా పాడుచు నేళ్ల తరబడిగాభద్రపఱిచినారు. పూర్వులకున్న జ్ఞాపకశక్తి, యవధాన గుణము లీనాటివారికి లేవు. అదియునుగాక ముద్రణాదిసౌకర్యములు వచ్చినందువలన ముఖస్థ మొనర్పవలసిన యావశ్యకత తప్పిపోయినది. మానవునికి నాగరకత వృద్ధియై పల్లెవేయుట న్యూనతగాభావించునంతటి సౌకుమార్య మబ్బినది. ఇవియన్నియు కారణములుగా పదకవిత్వమే బ్రతుకు తెరువుగా చూచుకొనుచున్న పై వృత్తి సంఘముల కాదరము క్రమముగా క్షీణించినది. తదితర వర్ణములవా రేవిధముగా నీ పాశ్చాత్య నాగరకతా సంపర్కమువలన తమ తమ ధర్మముల విడచి 'సర్వాం జగన్నాధం' అనెడి సాంకర్యమునకు లోనైరో యట్లే యీ నిరాదరణమును చూచి భరింపలేక క్రమముగా నా వృత్తుల మాని యాంగ్లవిద్యాభ్యాసము మొదలిడి యందరిలో కలసిపోయిరి. అంతతో పదకవిత్వ మడుగంటినది. విద్యార్జనమునకు పల్లెలనుండి ప్రజలు పట్టణముల కెప్పుడు వచ్చిరో యప్పుడే పదకవిత్వమునకు ప్రచారము నాశమైనది. నేడు ప్రాచీన పదకవితా వైభవము నరయుటకు సరియైన యవకాశములు లభించుటలేదు. ఆ ప్రాచీన సంప్రదాయము వదల లేక యెచటనైన నీవృత్తిసంఘము లున్నను, పదకవిత్వ సమగ్రస్వరూపము దాటిపోయినట్లే. ఒకజాతి పదకవిత్వము

నశించిపోయినచో నాజాతి సంస్కృతికూడ నాశమైనట్లే భావింపవలెను.

కావున సాహితీసేవకులు మన ప్రాచీనపదకవిత్వమును సేకరించుటలో వారికాలము వ్యయింపవలసియున్నది. శ్రమకోర్చి యూరూరు తిరిగి, ప్రాచీనపదములను, కీర్తనములను పాటలనాయా యిస్థలములందున్న వృద్ధులనుండి, పనిపాటల వారినుండి గ్రహించి వ్రాసికొని యొకచో గూర్చుట మన జాతికర్తవ్యము. అనగా ప్రతివాని బాధ్యత యని తలంపవలెను. ఇట్టి సంకలనము సంఘజీవితమును చిత్రించు చరిత్ర కాజాలని కల్యాంశోపయుక్తముగుండుయే కాక, స్వచ్ఛమై జాతీయమైన తెలుగుభాషాస్వరూపమునందించినదగును. ఈపదకవిత్వమును సేకరించి ప్రచురించినను వానిని పాడవలసిన ఘణుతులలో పాడుముండకపోయిన ప్రాచుర్యము లేకపోవును. ఇందులకాయా వృత్తి సంఘములను పోషింపవలెను. అప్పుడుగాని సంపూర్ణము గాదు. కావున నిట్టిపదకవితా సంపుట మొకటి కూర్చి ప్రకటించి ప్రాచుర్యము కల్గించుట మన ప్రజమీద నున్నది.★ పదసాహిత్యమునకు నివాళి పట్టెడి సాహిత్యార్చకులు రావలసి యున్నారు. శ్రీ[illegible]తులు దేవేంద్రసత్యార్థి, నేదునూరి గంగాధరము, టేకుమళ్ల కామేశ్వరరావులు చాలవరకీ మార్గములో కృషిచేయుచున్నారు. ఇటీవల విద్యలేని ప్రజలపై సానుభూతి

★ నీచక్కని సాంప్రదాయమును—కమ్మని పలుకుబడిని—విశిష్టమైనభాషాన్యాయమును - పలుకుబడుల జాతిచ్ఛందస్సులను - నీ జన్మహక్కుగా పోరాడి రక్షించుకోవలసిన అవసరముమాత్ర మున్నది. శ్రీఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి ఆంధ్రకవిగాది - బహుధాన్య.

హెచ్చుచున్నది; ప్రజావాఙ్మయము వ్రాయవలయు ననెడి యభిప్రాయము కల్గినది. దేశభాషాభిమానములుమిక్కుటమైనవి. ప్రజలలో విజ్ఞానవ్యాప్తికై దీక్షపూనినవారు కాలయాపనము చేయక యీ పదకవిత్వమును సేకరించుచో ప్రాచీన పదకర్తలిచ్చిన సంపద యొక్క విలువను గుర్తించి సేవచేసినట్లగుదురు. ఇట్టికార్యమునకు ప్రస్తుతకాల మత్యంత మనుకూలించును. సాహితీసేవకు లుత్సాహముతో నీకాలమును సద్వినియోగ మొనర్తురని యాశపడుచున్నది.



# ప్రబంధ వాఙ్మయము*



వాఙ్మయముయొక్క స్వరూప నిర్ణయ సందర్భమున ననేక ప్రమాణములఁబట్టి యనేక భేదములను మన యాలంకారికులు నిర్ణయించినారు. ఛందోలక్షణము ననుసరించి కావ్యములు గద్యాత్మకము లనియు, పద్యాత్మకము లనియు, గద్యపద్యాత్మకము లనియు మూఁడు విధములుగాఁ బరిగణింపబడినవి. ఈ గద్యపద్యాత్మకమను కావ్యజాతిలోఁ జేరునదే ప్రబంధము. కాని గద్యపద్యాత్మకమైన ప్రతికావ్యము ప్రబంధము కానేరదు. చంపువులు నాటకములు, పురాణములు, ఇతిహాసములు- గద్యపద్యాత్మకమైన కావ్య ప్రక్రియను జెందినవే. కాని భిన్నలక్షణములు గలిగిన వీని నధిగమించి, విశిష్టమైనస్థానము నందుకొనినది ప్రబంధము.

కావ్యమునకు భావ వస్తు రచనలు ప్రధానమైనవిగా పెద్దలు ప్రతిపాదించినారు.[1] ప్రబంధమం దితర కావ్యభేదముల కన్న వస్తువు నాలంబనముగాఁ జేసికొని, భావరచనల కెక్కుడు స్థాన మొసంగినట్లు గమనింతుము. ప్రబంధోచితమైన వస్తువును గ్రహించుటలో విశిష్టత లేకపోలేదు. అట్టి

---

★ నవంబరు 1943 లో వ్రాయబడినది.

1. శ్రీయుతులు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, కుఱుగంటి సీతారామయ్యగార్లు.

వస్తువుయొక్క యునికియేకాక తద్దేహమున కావశ్యకమగు సంధిసామగ్రి, సౌందర్యప్రసాదితములగు నితరావయవ సౌష్ఠవము లుండవలెను. అపుడే ప్రబంధ మగును. కావ్యమునం దంగాంగిభావము లేనిదే సౌందర్యము సుగ్రాహ్యము కాదు. కావ్యమునందలి ప్రత్యవయవమునకును, వస్తువునకును, ప్రకృష్టమైన బంధముండుటను గనుకనే యీ శిల్పమూర్తికి ప్రబంధమను పేరు వచ్చినది. 'ఈ ప్రబంధమాంధ్ర వాఙ్మయ వనములో నుద్యానమువంటిదిగ సాహిత్యవేత్తలు పరిగణించినారు.

(కావ్యమీమాంసఁ జేసిన పూర్వాలాక్షణికుల మతములన్నియు, నిసుమించు ప్రబంధములు' కన్వయించుననియే చెప్పవచ్చును. 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అను జగన్నాథుని నిర్వచనము నిలచియున్నదిగదా! పూర్వులెల్లరెవరేయే యంశములకు ప్రాధాన్య మిచ్చి నిర్వచించినను కావ్యములోని బీజభూతమగు నభిప్రాయమునం దేకీభవించియే యున్నారు. కావ్య సామాన్యలక్షణములే కాక ప్రబంధమను మహాకావ్యమునకు లక్షణము వేఱుగ నిర్వచించిన విధ మారయుదము. పురాణేతిహాసములలోని యుపాఖ్యానమును జేపట్టి స్వకపోలకల్పనలచే దానిఁ బెంపుచేసి, యష్టాదశ వర్ణన లందరముఁ జొన్పించి, రసాభివ్యక్తికిని, పాత్రచిత్రణమునకు నెక్కుడు ప్రాధాన్య మొసఁగి, శబ్దార్థాలంకార సహితముగా సాగించిన రచనను ప్రబంధమనినారు. ఈవచనమునకుఁ దగినట్లుగాఁ బూర్వలాక్షణికోదాహృత శ్లోకముల నిట నుదాహరింతును. అష్టాదశ వర్ణనల నుగ్గడించుచు —

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ప్రాత ర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌచ, మునిస్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీఇహ

అని పేర్కొనినాఁడు లాక్షణికుఁడు. సర్వ ప్రబంధ సామాన్యలక్షణముగా—

"ఆదౌ నమస్క్రియా౽౽ శీర్వా వస్తు నిర్దేశ ఏవవా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణ కీర్తనమ్"

అనియు నిర్దేశించిరి. పాత్రనిర్మాణ సౌకర్యార్థమై యుదాత్త నాయకుని చరిత గహింపవలయునని—

"సర్గ బంధోమహాకావ్యంతత్రైకో నాయక స్సురః
సద్వంశః క్షత్రియోవా౽పి.......... ... ...
ఏకవంశ భవా భూపాః కులజా బహవోపివా"

అను శ్లోకమందు వచించెను.

అప్పకవియుఁ జైశ్లోకార్థములనే తన లక్షణ పద్యమందుఁ జొప్పించెను. కాని, యష్టాదశ వర్ణనములకు మాఱుగాఁ బదునది రెండువర్ణనలను చెప్పవలయునని సంఖ్య బెంచినాఁడు.

పురమును ఋతుషట్కమును ప్రయాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మానీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు

శంభుదాసుని గ్రంథములో నైతము ప్రబంధశబ్దము గానిపించుచున్నది. అదియునుంగాక, యెఱ్ఱాప్రెగడకు ప్రబంధ పరమేశ్వరుఁడను బిరుదనామము గలదు. ఇతని నృసింహపురాణము పేరునకు పురాణమే కాని సత్యము నకు ప్రబంధ మగును. ప్రబంధోచితమైన ప్రాత్రచిత్రణము నెట్లు తిక్కన సాధించినాఁడో యెఱ్ఱాప్రగడ వర్ణనల నట్లు తన రచనలందు మిక్కుటముగా వెలయించినాడని గ్రహింపగల్గుదుము.

ఇవ్విధముగా ప్రబంధ బీజము కవిత్రయు కాలమునాటికే నాటబడినట్లు తెనుగు సాహితీక్షేత్రజ్ఞులు తెలిసికొనగల్గుదురు. శ్రీనాథుని యుగమునందు పెరిగి పెద్దదై ప్రబంధ వృక్షము పెంపువహించినది; తర్వాత శ్రీకృష్ణరాయలపోషణమునచే గిర్చి శాఖోపశాఖలు వేసి పూతపూచి ఫలవంతమై విలసిల్లినది.

పూర్వోక్తమగు ప్రబంధశబ్ద నిర్వచనమున కెల్లెడల సరియగు కావ్యము శ్రీనాథుని గ్రంథములలో లేకపోలేదు. అతని శృంగారనైషధము ప్రబంధమగును. ఇందలి యితివృత్తము లోకప్రసిద్ధమైనది. దీనికి మాతృక భారతములోని నలదమయంత్యుపాఖ్యానమును కావ్యముగా నిర్మించిన హర్షకృత నైషధము. స్వకపోలకల్పనలతో శ్రీనాథుఁడు శృంగారనైషధమున పూర్వముగా నిర్వహించెను. వస్తునిర్మలనమందేమి సంభాషణా చాతుర్యమందేమి, పాత్రనిర్మాణ పోషణాదికార్యములందేమి, వర్ణనా కౌశల్యమందేమి శ్రీనాథుఁడప్రతిమాన నైపుణ్యమును ప్రదర్శించినాఁడు కాని, ప్రబంధతారోపణము పూర్తిగాఁ జేయుటకు శృంగారనైషధ మను వాదమ

గాఁట పిలిచ్చినది గాదు. ప్రబంధములు సర్వదా స్వతంత్రములై యుండవలెనుగదా!

శ్రీనాథ రచితేతర గ్రంథములను బరిశీలించినచో హరవిలాసమునందు వస్త్వైక్యము లేకయు, భీమ, కాశీఖండము లందలి వస్తువు స్థలపురాణ మగుటయు, సమగ్రప్రబంధలక్షణము నకు నిలువనివిగా నున్నవి. ఇవ్విధముగానే శ్రీనాథయుగ మందలి యితర కవికృత గ్రంథములను గొన్నను, కొన్ని యనువాదములగుటవలన, కొన్ని చిత్రాఖ్యానములగుటవలన, మఱికొన్నింట నోచితమైన సంభాషణాదికమే కలిగియుండుట వలన, నేవియు సమగ్రప్రబంధమున కుదాహరణములు కాలేక పోయినవి. ప్రబంధాంగములలో గొన్నికొన్ని ఆయా గ్రంథము లలో గన్పించుచుండు నేకాని సర్వాంగ పరిపూర్ణ స్వరూప సంధానము వీనియెడ గన్పింపదు.

ఆంధ్రులు గర్వింపదగిన కాలము కృష్ణరాయల పరిపాలనా సమయము. అది స్వర్ణయుగ మనవచ్చును. రాజకీయములో, సాహిత్యములో నత్యున్నతస్థానము గడించిన యుగము. ప్రబంధ సుందరికి సకలాభరణభూషలు రాయల పోషణమందే లభించినవి. కృష్ణరాయలే స్వయముగా నీసుందరి నలంకరించినాఁడు. తన యాస్థానమందలి రసజ్ఞులైన కవి సత్తములచే నలంకరింపించినాడు. ఆ సంపూర్ణకళావిశేషమును జూచి మురిసిపోయినాడు.

| శ్రీ కృష్ణరాయల పోషణమున సర్వలక్షణసమన్వితమైన ప్రబంధమూర్తి విలసిల్లినది. అష్టాదశవర్ణనముల శోభ జెందె.

శృంగారరస ప్రధానమై అర్థాతిశాయి యైన శబ్దరచనకలిగి, యాలంకారిక సాంకేతికములకువిధేయమై, యనతివిస్తృతమగు నితివృత్తముతో, భాషాంతరీకరణమునకు భిన్నముగా నుండి, పాత్ర సంపోషణమును బరిగణించు స్వతంత్ర గ్రంథము ప్రబంధమని పెద్దలనిర్వచనము [1]/ ఈనిర్వచనమునకు సరితూగు గ్రంథము పెద్దనకృత మనుచరిత్రము. మనుచరిత్రమే పెద్దన కగ్రతాంబూలము సాహితీలోకమున లభింపజేసినది. వస్త్వైక్యమందేమి, వర్ణనములందేమి, అంగాంగి రస పోషణమందేమి, సన్నివేశకల్పనమందేమి, పెద్దనామాత్యుడు పెద్ద గాకపోలేడు. వరూధిని సాహితీలోకములో స్థిరనివాస మేర్పరచుకొన్నది; ప్రశాంతమూర్తియగు ప్రవరుడు పవిత్ర స్థానము నలంకరించినాడు. పాత్రచిత్రణములో నల్లసాని వాని నల్లిబిల్లిగొను వాడితరుడు లేడనవలసివచ్చును. సాంకేతిలో నితనిని దలదన్నునట్లుగన్పించు వసుచరిత్రకారుడు సైతము పెద్దన ననుసరించినవాడేగదా! పెద్దన కైతకు మెరుంగులు దిద్ది సెబాస్ అనిపించుకొనినాడు రామరాజభూషణుడు. కవులను గిలిగింతపెట్టు కవితాభావములను ప్రదర్శించినాడు పెద్దన; పండితులను పట్టిచూచు శబ్దచమత్కృతి సర్వత్ర ప్రయోగించినాడు రామరాజభూషణుడు. ప్రబంధము పరకోటి వసుచరిత్రమందే [2] యందినదని నిశ్చయముగ జెప్పవచ్చును. కల్పనా జాతము హెచ్చుగ నుండుటచే కళాపూర్ణోదయము ప్రబంధ మనజాలము. పాండురంగమహాత్మ్యము కాళహస్తి

1 శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి వచనము.

2 వసుచరిత్ర సంస్కృతీకరింపబడుటకు గర్వకారణము.

మాహాత్మ్యములు స్థలపురాణములగుట సమగ్ర ప్రబంధములు కాజాలవు. అయినను వానిలో సిగిమ శర్మోపాఖ్యానము, తిన్నని వృత్తాంతములు ప్రబంధోచిత వస్తు తత్వముగలవి; పాత్రపోషణమునకు నెక్కువ నవకాశము గలిగియున్నది. రామాభ్యుదయము, పారిజాతాపహరణములు ప్రబంధములేయగును. పారిజాతాపహరణమున ప్రథమాశ్వాసము ప్రాధాన్యము నహించినట్లు కన్పించును. రామాభ్యుదయము సంస్కృతములో కావ్యప్రక్రియను నడచినది: సుందర ప్రబంధతా యోగ్యత లనేకము లింకున్నవి. ఇవ్విధముగా శ్రీకృష్ణదేవ రాయల పోషణమున ప్రబంధసుందరి సర్వాలంకార భూషిత యైనట్లు తెలిసికొంటిమి.

వసుచరిత్ర వంటి శిఖరప్రాయమైన ప్రబంధము వెలసిన పిమ్మట, దాని డీకొను కావ్య మింకొకటి యుద్భవింప లేదు. తరువాత వెలసిన ప్రబంధములన్నియు, మహావృక్షముక్రింద మొలచిన చిన్న చిన్న మొక్కలవలె గాంతివిహీనము లాయెను. వసుచరిత్రతర్వాత నట్టిప్రబంధము జన్మింప లేదు. తరువాత వచ్చినకవులకిది యాదర్శప్రాయమైనది. ఆదినములలో ప్రబంధ మార్గమున రచించిన నే కావ్యముల కాదరణకలిగెడిది. అందుచే ననుసరణము లనివార్యము లాయెను. ఇట్టి గ్రంథములు కుప్పతిప్పలుగ నున్నవి. గ్రంథ నామములందును దాస్యము తప్పలేదు. కవిజన రంజనము, రసికజన మనోభిరామము, కవిరాజ మనోరంజనము లొకే విధమగు నామములుగదా!

ఈ యనుసరణములందు పెద్దననుండి వచ్చుచున్న కవిసమయములు, వర్ణనాక్రమము, పద్యముల మెత్తుగడలు,

సన్నివేశకల్పనములు, యథాకథముగ దిగుమతియైనవి. నంది తిమ్మయ మూర్తికవులట్లుగాక మూలములకు మెరుగు పెట్టిగాని యీవర్ణనాదికము తమ గ్రంథములందు చొప్పింపరు. సమర్థులైన కవులు చేయుపద్ధతి యట్టిది. కాకవు లనుకరణముల తోడనే నామము గడించుటకై కడంగుదురు. ప్రబంధమే చర్విత చర్వణమైనపుడు తద్గత వర్ణనలు నెట్టివైన, వినూత్నానందము ప్రసాదించుట దుర్లభమే కదా! కావున నీయనుసరణాల వలన ప్రబంధములందు క్షీణదశ యొకటి వచ్చినదని చెప్పవలెను. ఈ దశ యాంధ్రసారస్వతమునం బదునెనిమిది, పందొమ్మిది శతాబ్దములలో వరలినది.

నాయకరాజుల ప్రాభవమున వెలసిన సారస్వతమున విశిష్టప్రబంధములు లేకపోలేదు. అనంతభూపాలుని కకుత్స్థవిజయము, సవరము చిననారాయణప్ప నాయకుని కువలయాశ్వచరిత్రము లెన్నదగినవి. వీనిలో నైతము పెద్దన సూరనల భావరచనల కనుకరణములు దోఁచును. అయినను వీనికి ప్రత్యేకస్థాన మీవలసియే యున్నది. ముద్దుపళని రచించిన శృంగారప్రబంధమగు రాధికాసాంత్వనము నెన్నక నాయకరాజయుగము ముగించుటకు వీలులేదు. శృంగారప్రబంధములలో నిది మేలుపూస. కాని యేహ్యమగు భావచిత్రణ మీ గ్రంథమున నుంటయే దీనికి సరసు లిచ్చిన దోషము. ఏతత్కారణముచే నిది క్షీణదశకు నాందివంటి ప్రబంధమైనదిగా భావింతుము.

---

*చూ: 'వసుచరిత్ర విమర్శనము': అనుబంధము ౨ — శ్రీవఝ్ఝల పండితులు.

ఈ కాలమునకు జెందిన ప్రబంధములలో నసభ్య శృంగారమే మిక్కుటమై వరలినది. విజయనగర సామ్రాజ్య మంతరించిన తరువాత దాని క్రింద నున్న సామంతు లందరు స్వాతంత్ర్య ప్రభువులైరి. వీరహంభావముతో విఱ్ఱవీగి విషయ లాలసతో కాలముగడపిరి. వీరి ప్రాపువడసిన కవులు రాజుల చిత్తవృత్తుల ననుసరించి కావ్యముల వ్రాయవలసి వచ్చినది. ఈ కారణమువలననే పచ్చిశృంగారము నాటి కావ్యములలో వర్ణితమైనది.[1] అటువంటి ప్రబంధములు తారాశశాంక విజయము, బిల్హణీయము, హంసవింశతి మొదలైనవి.

శ్రీనాథయుగమని పేర్కొనదగిన నెన్నదగిన ప్రబంధము లీ కాలమం దుద్భవించలేదు. కాని వానిని మహోన్నతమైన కృతులుగా నెన్నలేము. కాని ఆంధ్రసాహిత్యములో వానికిని స్థానమున్నట్లే చెప్పవలెను. అవి విజయవిలాసము, ఉత్తర రామాయణము, మొల్ల రామాయణములు. విజయ విలాసము నాయకుడొక్కడే కాని నాయికలు పల్వురు. వస్త్వైక్యము లేనట్లుద్యోతకమగుచున్నను ఏకనాయకాశ్రయమగుటచేనొకింత ప్రబంధ చిహ్నమున్నట్లు చెప్పనవచ్చును. ఉత్తర రామాయణము లోని వస్తువు ప్రబంధమునకు సుకుమారమైనను నందలిరచనలో కంకంటి పాపరాజు ప్రబంధోచిత బీజముల నాటినాడు. పాత్ర చిత్రణములో సన్నివేశ కల్పనలలో సంభాషణాది నిర్వహణములో నడుగడుగున ప్రబంధమూర్తి ప్రతిబింబించు నట్లు రచన సల్పినాడు. కథాకథనాత్మక మగు రామాయణము

---

1. A Hand Book of Telugu Literature P. 52

ప్రబంధముగా నవతరింపజేసినవారిలో అయ్యలరాజు రామభద్రుఁడు, కంకంటి పాపరాజు లగ్రస్థాన మలంకరింతురు. కుమ్మరిమొల్ల కవయిత్రులలో నున్నతస్థాన మాక్రమించునని చెప్పవలెను. చారిత్రకప్రబంధ మీ కాలములోనే తలయెత్తినది. కుమారధూర్జటి వ్రాసిన కృష్ణరాయ విజయము, రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాస విలాసము లుదాహరణములు.

ఇఁక నాధునిక కాలములో ప్రవర్తిలుచున్న సారస్వతమందు ప్రబంధ రచన మటసట గోచరించుచునేయున్నది. ప్రబంధమూర్తిపై నేవ జనించుచున్నను, ఒకప్రక్క ప్రబంధ రచనము సాగుచునేయున్నట్లు గమనింతుము. పింగళి కాటూర్లు వ్రాసిన సౌందరనందన మొక విలక్షణమైన నవీన ప్రబంధము. ఈ నూతన యుగమున ప్రబంధమూర్తి కొక నవ్యాభరణము సేకూర్చినారు కవులు. చారిత్రక ప్రబంధము లీ యుగముననే సర్వాంగసుందరముగ వెలయుచున్నవి. దుర్భాక రాజశేఖర శతావధాని రచించిన 'రాణా ప్రతాపసింహ చరిత్ర'యు, గడియారము వెంకటశేషశాస్త్రికృత 'శివభారతము' నుత్కృష్ట ప్రబంధముల కుదాహరణములు. పాణిని, పతంజలి, కాత్యాయనుల చరిత్రములను, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి 'మునిత్రయ చరిత్ర' మను పేర రసవత్ప్రబంధమును రచించి యందజేసినారు. చరిత్ర నింత రసవంతముగా ప్రబంధప్రక్రియలో నిమిడ్చి చిత్రించుట ప్రశంసనీయము. వీని ప్రాచుర్యము నుంచిన నీ నాటికిని ప్రబంధ ప్రక్రియకు సహృదయ సానుభూతి యున్నట్లు స్థిరమగుచున్నది.

ప్రబంధ వాఙ్మయము నొక్కమా రవలోకించిన, సంస్కృతవాతావరణమును బాగుగజీర్ణించుకొనబడిన ఆంధ్ర వాఙ్మయములో, దిక్కన ప్రబంధబీజమును నాటినట్లును, దానికి బాదుచేసి నీరువోసినవాడు శంభుదా సన్నట్లును, ఎరువుపోసి పెంచినవాడు శ్రీనాథు డన్నట్లును, పూత పూయునట్లు చేసినవాడు పెద్దన యన్నట్లును, ప్రబంధ వృక్షము బహుశాఖాయుతమై శోభిలి ఫలవంతమైనది రామ రాజభూషణుని వలన నన్నట్లును గమనింపగల్గితిమి. తదుపరి చిన్నిచిన్ని మొక్కలు జనించినను తదున్నత వృక్షచ్ఛాయ వాడిపోయినట్లు, కొన్నిమాత్రము గిట్టినట్లును తెలిసితిమి. ఆంధ్రులు కవితారచనలలో నింతవఱకు ప్రత్యేకించి సాధించిన కావ్యప్రక్రియలలో నొక్క 'ప్రబంధము'నవే సిద్ధహస్తులైరనుటలో సందేహములేదు. ఇది గర్వసూచకముగదా!

# ఆంధ్రవచన స్వరూపము

## సూత్రగ్రథనము



## మొదటి భాగము

కావ్యముయొక్క స్వరూప, జాతీయయోజనఁ జేసి నపు డనేకప్రమాణములనుబట్టి యనేకభేదములను (types) పాశ్చాత్యులును, మన యాలంకారికులును నిర్ణయించినారు. ఆప్రమాణములలో ఛందస్థితి, కావ్యములోఁగల్గు సంబంధము, వస్తుతత్త్వములు ముఖ్యములు. ఇందాద్యప్రమాణమగు ఛందస్థితి ననుసరించి కావ్యము త్రివిధములుగా విభజించినారు; గద్యాత్మకమనియు, నుభయాత్మకమనియు నివి చెలగుచున్నవి.

ఇఁకఁ బద్యమునకును *గద్యమునకు నున్న భేదము నారయుదము. ఇవి రెండును గావ్యశబ్ద వాచ్యములే. ప్రాచీనాలంకారికులు నిర్వచించిన కావ్యత్వ మీరెంటను బ్రవర్తిల్లును అయిన భేద మెచట? పద్య మావేశపూరితమై, యుదాత్తవిషయాన్వితమై, వ్యంగ్యమర్యాదాశ్రయిణియై, రసప్రధానమై వఱలుచుండును. గద్యమట్లుగాక, వస్తుస్వరూపయాథార్థ్యము

* ఇట గద్యమనఁగా వచన మని వాడుక. (Prose)

గలిగి, స్వభావోక్తి ప్రధానవిషయముగా గలిగి, అన్వయ సౌలభ్య సహితముగా నపేక్షమాత్రముననే చెప్పు ప్రక్రి తానుసారియై భాసిలును. ఈ భేదమునే వివరించుచు 'ఆర్నాల్డు'

"The Rhythm and measure of poetry elevated to a regularity, certainity, and force very different from the rhythm and measure, which can pervade prose, is a part of its perfection."
అని వచించెను.

గద్యము పద్యముకంటె భిన్నమైనది; అది బాహిరముగాను యంత్రవత్తుగా నుండునది. పద్యము ట్లుగాక హృద్గతభావమును నియమబద్ధముగా, లయాన్వితముగా (Rhythmical)నుంచునది. గద్యముదీనికిభిన్నమై, ఛందోనియమములు లేక, విరామాదులు లేక, యనేకగతుల నడుచును. ఈ రెండింటికి భూజలధులకున్న భేదమున్నది. అనగా నొకటి ద్రవరూపముగలిగి చలనశక్తి కలిగినది. రెండవది ఘనీభూతమై స్థిరత్వమును బొందునది. గద్యపద్య భేదము కేవలము భౌతికభేదమే కాని వేఱుగాదు. అనగా, మనము పర్యాలోచించునవి మానసికసంబంధ విషయములుగనుక, నీ భేదము మానసికతత్త్వ సంబంధమైన భేదముగా నున్నది, చిత్తప్రవృత్తి ననుసరించు నొక ప్రక్రియ పద్యము. వేఱొక ప్రక్రియ గద్యము.(పద్యము సృష్టిస్వరూప పరిణామము. గద్యము నిర్మాణస్వరూప పరిణామము.) సృష్టి యనగా ప్రతిభాసమన్వితమైనది. భావావేశములోఁ బడ ములు పుట్టుచుండును. పదములకు నిర్దేశింపబడిన యర్థములు గాక, ఛాయాభేదములతో నవి నూతన పదములగుచుండును.

భావమునకును, పదమునకును మధ్య నెట్టివిరామము నుండదు. భావమే పదమునకును; పదమే భావమును సూచించును. ఇట్టి యవినాభావ సంబంధ మీ పద్యరచనలో భావపదములకు వర్తించును.

వచన రచనలో బదము లన్నియు యథాతథములుగా నిలిచియుండును. వానికున్న యర్థములోనే యవి వర్తిలును. నిర్మాణకార్యమునకు గడంగినపు డుపకరణము లన్నియు సిద్ధముగా నున్నట్లు, పదము లన్నియు యంత్రితవస్తుగా సకాలమున కవి తమ స్థలముల నాక్రమించుచుండును. వచన సృష్టికార్య మొక ప్రణాళిక ననుగమించునది. 'దాని కొక క్రమ మున్నట్లు (logic) స్పష్టము.'

పద్యమందు భావోద్రేకమున కనుగుణముగా బదములు భాసిల్లునుగాని యొక నియమముగా నుండవు. కావున వచనములో నిట్టిభావావేశమున కనుగుణముగా వచ్చు పదములు దొరలినచోట నావచనము వచనముగాక, కవిత్వమే యగును. కార్లైలు వచించిన—

'Poetry is musical thought'

అను వచనానుసారిగా రసభావమును పొందు శబ్దార్థ స్వరూపమును బ్రదర్శించునట్టిదైన నది కావ్యమే యగును. విశ్వనాథకవిరాజు—

'వాక్యం రసాత్మకం కావ్యమ్'

అనిన వచనముగూడ దుల్యమైనది. వచనరచనలలో శబ్దస్వరూపము నెఱిగి, దాని శక్తి (force) లేక వ్యాప్తివి

తెలిసి, యథాస్థానములో, సముచితమైన సందర్భములోఁ బొందుపఱచవలెను. వచనరచనకు శబ్దార్థస్వరూపజ్ఞాన మావశ్యకము. (రచయితకు శబ్దాధికారము లేనిదే వచనరచన రాణింపదు.)

(పద్యమెట్లు భావప్రధానము గలదియో, గద్యము లర్థప్రధానము గలది.)

(పద్యము సయితము గద్యముయొక్క లక్షణములు కలిగియుండవచ్చును. అట్టి గద్యపద్యలక్షణముల (ఒక గణబద్ధతయందుగాక) గ్రహింపనగును.) ఇట్టి ప్రక్రియావిశేషద్వయములో నాద్యంబగు పద్యము లనేకములు గలవు. అట్టి పద్యములు నామమాత్రము లేకాని వేఱుగావు.

ఉదా॥ ధర్మనిధియైన మీతండ్రి దశరథావ
నీశుఁ డొకనాడు నిజపురోహితునిఁ జూడఁ
దలఁచి రథమెక్కి సూతకృత్యంబు నేను
బూనగ వశిష్టముని వనంబునకుఁబోయి. (ఉ. రా.)

ఇట్టివి యనేకములు గాననగును.

కవితావస్తువు లేక రసభావము లేకయే రచింపఁబడిన ఛందోనువర్తియైన రచన కవిత్వ మనిపించుకొనక, ఆత్మలేని శరీరమువలె నుండును. (కాబట్టి కవితయనునది భావమందున్నదిగాని, రచనలో లేదని చెప్పవచ్చును.) పద్యమందలి గణనియమము శబ్దాలంకారమువంటిది. గద్యమం దట్టిలోపమును బోనాడుటకై దానిని శబ్దాలంకార సహితముగను సమాసగుంఫితముగను రచించినట్లు కన్పించుచున్నది. (వృత్తఘటిత

స్మృతులు, వైద్యగ్రంథములుగూడ మహాకావ్యములు కావలెను. కావుననే "గద్యం నికషం కవీనాం వదంతి" అని ప్రాచీనులు నిశ్చయించిరి. గణనియమము లేని లోపమును బోనాడుటకై రచించినదే-'ఓజస్సమాస భూయస్త్వమేతద్గద్యస్య జీవితమ్' అను వాక్యము. ఈ లక్షణము ననుసరించిన గద్యకావ్యములు సంస్కృతమున నున్నవి. పద్యరచనలో నున్నది. ఆ కవితాభావమున కొక గూడవు నమర్చుటయే.

"Verse is apparelled only being
but on ornament"

—Sir Phillip Sidney.

కావ్యసృష్టికి అనుభూతి ప్రధానము. కవి తాను జూచిన వస్తువులోని సౌందర్యాదికము ననుభవించి, దానిని వ్యక్తీకరించును. ఈ వాక్యే 'రసభావము' తనంతట తాల్చిన శబ్దార్థస్వరూపము. (ప్రాక్సన మానవుడు ప్రకృతిసౌందర్యమునకు ముగ్ధుడై గంతులు వేసి, పదము పాడెనని గ్రహింపగల్గుదుము. వాల్మీకిశ్లోకము శ్లోకరూపమునే ధరించినది; కాని గద్యరూపముగాదు, కావున నానందానుభూతిం బొందినపుడు లయాన్వితమైన గీతియే వెలువడును. ఇందలి సూక్ష్మధర్మమేమన, గీతిహృదయజన్యము. గద్యము బుద్ధి (Reason) జన్యము. హృదయప్రదీపకరణము కళవలన గల్గును. బుద్ధినైశిత్యము శాస్త్రమువలన బొడమును. పై క్రమమును బట్టి, బుద్ధికంటె పూర్వము హృదయవికసనము సహజముగాన, గీతియే ముందు పొడసూపునది.

It is a sort of common place of literary history that verse is always older than prose, and in the case of most literatures—especially modern ones—it is almost demonstrably so —Saintsbury.

సారస్వతము వివిధశాఖా విరాజితము. ప్రతిశాఖయుఁ బరిపూర్ణత నొందినగాని సారస్వతముయొక్క సమగ్రస్వరూపము గోచరము కాదు. అభివృద్ధియనునది యేకదేశమైనను, క్రమాగతముగ లేకపోయినను గుదిరింపదు. అందుచేతనే విభాగములు స్వయంపూర్ణమై, క్రమాభివృద్ధిని పొంది, సమగ్ర సారస్వతమునకు దోహదభూతములవలెను. గద్యపద్యము లను ప్రక్రియాద్వయములలో గద్యమునకు చాలదినములవఱకు కాదరణము కలుగలేదు. అందుచే వచనరచన యెక్కుడుగా నేవిషయమును విస్తారము కాలేకపోయెను. వచనము విషయబోధనానువర్తి. ఇం దలంకారములకు ప్రాధాన్య ముండజాలదు. ఉద్దిష్ట విషయ మెవ్వనిను హృదయమునకు సూటిగాఁ జొచ్చుటకు వచనరచయిత ప్రయత్నించును. ఈ రచనములో వాచ్యార్థమే ప్రధానము. లక్ష్య వ్యంగ్యార్థములప్రధానములు. (లక్ష్య వ్యంగార్థములు వచ్చిననా డది గద్యములోనున్న కవిత్వ మనిపించుకొనునేమో కాని, కేవల వచన మగుటకు వీలులేదు.) అట్లే విషయస్వరూపబోధకై సదృశవస్తువుల నెన్నినపుడట్టివి యలంకారము లనిపించుకొన్నను, అలంకార బాహుళ్యముండదని మాత్రము చెప్పవలెను. శబ్దచిత్రములు అర్థచిత్రములు శైలిభేదములలో వచనమందు కప్పించినను, కేవల వచనస్వరూపమది కాదని ప్రాజ్ఞులు తెలిసికొందురు. అను

స్వాతముగా వచ్చు భావములను యథాతథముగా గ్రహించి కాపాడునది వచనము.

వచనము సారస్వతమున ముఖ్యమైన శాఖ. భావమును నిగూఢము గావించి తికమకలఁ బెట్టుటకును, చెప్ప దలఁచిన భావము నా పదజాలములో నా ఛందో విరామములోఁ జెప్పలేకుండుటకును పద్యమున్నది. వచనరచనలో స్వేచ్ఛగలదు; రచయిత తన భావమును విస్తరించి బోధింప నగును. (విషయప్రధానమైన రచన వచనమే.)

(వచన మెక్కువగా శాస్త్రరచనములం దుపయోగ పడును.) మానవజీవితమును సరిగా తెలియవలెననిగాని, తెలుపవలెననిగాని వచనమే చక్కని వాహిని. ఈ భావములకే పూఁతపూసి కావ్యకర్త పద్యములద్వారా వానిని కళయను రసాయనముగా తయారుచేయును. శాస్త్రకళల కున్న విభేదమే గద్యపద్యముల కున్నట్లు గ్రహింపనగును.

'When life is the criterion and not art, the prose of a nation is far more important than its poetry.'

—Evans.

చరిత్రలందుగాని, తత్త్వవిషయిక మీమాంసలందు గాని గద్యమే యుపాదేయముగాని పద్యము రాణింపదు. కావున వచనరచన తత్త్వవేత్తలకు, చరిత్రకారులకు నుపయోగపడునుగాని కవుల కంతగా నుపయోగకారి కాదు. పద్యస్వభావ లక్షణములఁ జొన్పి, గద్యమును కవులు తమ నవలలయందు, వ్యాసములందు, నాటకములందు వినియో

గించుకొననగును. అచ్చటచ్చట ననేక కావ్యభేదములలో నుపయోగింపబడుచు వచ్చిన వచనమును పర్యాలోచించుట క్లిష్టమే.

In literature prose embraces all forms of oratory and of representative discourse and the prose drama.

— New Standard Dictionary.

ఇందు ప్రతిపాదితమైన సంప్రదాయ మాంధ్ర వాఙ్మయముతో నతి ప్రాచీనమైనదిగా గ్రహింపగల్గుదుము.

ఆంధ్రసారస్వతము నవలోకించుటకు పూర్వము ముఖ్యముగా రెండుభాగములుగా కాలమును భాగించుట యవసరము. ఆంధ్రమునకు సంస్కృతభాషవలన వచ్చిన ప్రాబల్యము, ఆంధ్రమున కాంగ్లభాషాప్రాబల్యము. ఇట్టి విభాగమువలన నేవిషయమునైన చక్కగా సమున్మీలింప వీలగును.

పదునెనిమిదవ శతాబ్ది తుదివఱకు సంస్కృతభాషా ప్రాబల్య మాంధ్రమున నింతింతని చెప్పరాదు. సంస్కృతానుసరణము, అనుకరణము, అనువాదములే తప్ప ప్రత్యేక ప్రతిభను చాటు సమగ్రప్రక్రియ యొకటైనను ఆంధ్రమున నవతరింపలేదు. ఒకింత యత్నము జరిగినదనిన 'ప్రబంధము' పట్ల నేమేని జరిగియుండును. అంతియే. అచటను మాతృకలు సంస్కృతములోనివే. ఇట్లు సంస్కృతములోని ఛంద శ్శాస్త్రము, కావ్యములు, వైదిక వాఙ్మయము — ఇవి యననేల — ఆంధ్రములోనికి యథాతథములుగా నవతరించి

నవి. కావ్యభేదము లన్నియు (నాటకము తప్ప) సంస్కృతము నుండి తెలుగులోనికి దిగుమతి యైనవి. కావున సంస్కృత సంప్రదాయములు (భాషాశాస్త్రములు) తెలియని మానవునకుఁ దెలుఁగుసారస్వతపు దర్శనము కష్టతరము తోచుచుండినది. రానురాను, ఆ పరిభాష, సంప్రదాయములు కేవల మాంధ్ర భాషకుఁ జెందినవను భ్రాంతికూడ కలుగుచున్నది. ఇవ్విధముగా నాంధ్రభాషపై సంస్కృతభాషయొక్క ప్రభావము నలమినది.

ఇప్పటికి రెండుశతాబ్దములనుండి మనభాషపై నాంగ్ల భాషాచ్ఛాయలు, సంప్రదాయములు పడుట మొదలిడినవి. సంస్కృతము మనభాషపై నెట్టియ, కారము మున్నపూనెనో యట్టియధికారమునే యాంగ్లభాష వహించినది. క్రమక్రమముగా నాంగ్ల సారస్వతములోని గ్రంథము లవతరించుటకన్న, ఆ భాషలోని విధానమును, ఆ సారస్వతములోని వెలుగు జిలుగులు నెక్కుడుగా నాంధ్రమున నవతరింపఁ జేయఁబడినవి. ఇట్లవతరింపఁబడిన ప్రక్రియలలో నవల ప్రథమగణ్యము. తరువాత ఉపన్యాసము, కథానిక, విమర్శన, జీవితచరిత్ర మున్నగునవి తెలుఁగుభాషలో నవతరిల్లినవి. వచనస్వరూప మొకవిధముగాఁ జోటుచేసికొనినదనిన నది పందొమ్మిదవ శతాబ్దియందే యని చెప్పవచ్చును.

ఇవ్విధముగా సంస్కృతాంగ్ల సారస్వతముల ప్రభావము నవగతము జేసికొని, తెలుగురచనలలోని వచన స్వరూపము నారయుట సమంజసము.

అంతకుపూర్వము కావ్యములు కానరాకుండుటచే నజ్ఞాతయుగమునాఁటి గద్య సంప్రదాయము దెలియవలె

సంపన్నుండు మఱియు విజయరాజు విజయైశ్వర్యంబుగల స (శ) ర్వ్వ(హా) నంబు సేసి దిన (శ) గుళ్లుం బ్రాకారంబు మటంబును నెమిఱుంచి.

(రెండవ ప్రక్క)

......[బుధ్వా]......వ్రిచ్చినవ (వారు)......
దంబు [సల్పి] నవ (వా)రుది .....[ం] బుగద్యంబుల నలన (శ్వా) స్వ (శ్వ) తంబు......[యును] ఇ (ఈ) భూమిలోన.

(ధర్మవరము శాసనము)

(మూడవ విజయాదిత్యునినాటి శాసనము)

తెలుఁగు కవితావతరణ మెట్లు సంస్కృతానువర్తియై వరలినదో, అట్లు తెలుఁగు శాసనములపట్లను సంస్కృతి చ్ఛాయపడుట తప్పలేదు. కావున శాసనములందు లభించు తెలుఁగు గద్యభాగములు నామమాత్రికము లేకాని, స్వచ్ఛందమైన తెలుగువచనముయొక్క స్వరూపమును బ్రదర్శించునవి కావని సిద్ధాంతీకరింపవచ్చును.♦

ఇఁక నాంధ్ర సారస్వతములో నాదికవియగు నన్నయ రచనను జూచినచో నందు సంస్కృత పదబాహుళ్య సమాససంఘటనములు గాన్పించును. ఆతనిభారతము చంపూ కావ్యముగా బయలుదేరినది. (ఇచట చంపూకావ్యమున గద్యపద్యములకు సమానస్థాన మీయఁబడినది.)(కనుక పద్య

---

♦ 'రెండో మూఁడో పద్యములుగల శాసములుఁతప్ప నన్నయకుఁ బూర్వకాలపు తెనుఁగుభాష స్వరూపమును దెలియఁజేయు నాధారములు గానరాకున్నవి.' —డా. చిలుకూరి.

ముతోఁ గూడ యెడముగా నడిచిన యీగద్యమంతయుఁ గవితా పదార్థ భూయిష్ఠమే కాని నీరసముగానేరదు; కావున నెన్నఁడు వచనము మొదటినుండియే పద్యముతో సరిగా సాగివచ్చుచునే యున్నదని తెలియుచున్నది. )

నన్నయనాఁటినుండియే 'గద్య' మను పదమున కొక విలక్షణార్థము మన కున్నట్లు తెలియనగును. గద్యము వచనమునకుఁ బర్యాయ పదముగా నుపయుక్తమగుచున్నది. కాని 'గద్య' మను ప్రత్యేక ప్రక్రియ మనకొకటి నిర్దిష్టాకారముతోఁ నున్నట్లు గమనింపగలుగుదుము. కావ్యములలోఁ బ్రతి యాశ్వాసాంతమున 'గద్య' పొడగట్టును. దీని ప్రయోజనము లేవి యనగా, నా కావ్యరచయిత యొక్క వంశ గురు నామాదికములను, కావ్యమందా యాశ్వాసములలోఁ బ్రతిపాదితమైన విషయములను వెలిబుచ్చుటయే. అనగా నేఁటికావ్యములలో 'విషయసూచిక' లను శీర్షికక్రింద వచ్చువస్తువు. గ్రంథోపరిభాగమున నచ్చిడఁబడునట్టి కావ్యకర్తృ నామాదికము లీగద్యము ప్రాచీనకాలములోఁ జివరనిర్వర్తించెడివన్నమాట. కావున వీనియందు కవితాభావ ముండుటకు వీలు లేదు. విషయబోధనయే ప్రధానోద్దేశ్యము.' అందువలన నీగద్యమందు కవిత్వ ముండకపోగా, కేవల వచనముయొక్క స్వరూపము కించిద్వ్యక్తమగును కాని, యీగద్యములు కేవల వచనములు కానేరవు. )( గద్యభాగము సమాసభూయిష్ఠమై యనుప్రాసాలంకారయుక్తమై పద్యములోనుండు శ్రుతికి (Rythm దీటైన లయకలిగివిరాజిల్లుచుండును. )( ఈ శబ్దాలంకార, సమాస

"సకల గుణసనాథ సోమనాథ ప్రణీతంబైన..."

"శ్రీమదఖిల కవిమిత్ర పెదయన్నయామాత్య పుత్ర శారదా దయావిధేయ జక్కన నామధేయ..."

ఇట్లే చాలమంది కవులు తమగద్యలను రచించిరి.

కవులు తమ ఆశ్వాసాంతగద్యములలో నిష్టదేవతా సూచనమును జేయుచుందురు. ఇందులకుఁ గొన్ని:—

"శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సింగమ రమానారాయణ జక్కయనారాయణ తనూభవ పరాఙ్ముఖధూర్జటి..."

"శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ..."

ఇట్లే రామరాజభూషణుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగు కవు లనేకులు తమ యుపాస్యదేవతలగూర్చి గద్యమం దుల్లేఖించిరి. ఈ గద్యభాగములవలనఁ గవి జీవితమునుగూర్చి యిసుమంత చరిత్ర తెలియుట యుపయోగము. ఈ గద్యరచయిత కొన్ని యెడల కావ్యకర్తయే కావచ్చును. కొన్నిపట్ల నా కావ్యముయొక్క ప్రతుల వ్రాసికొనిన వారే వ్రాసియుండవచ్చును. ఈ రెండవయంశమును స్థిరీకరించుట కాయా వ్రాతప్రతుల యాశ్వాసాంతగద్యలలో విలేఖకుల నామాదికములుగూడ కనఁబట్టుచున్నవి. ఇట్లే 'గద్యము' అను ప్రక్రియ ప్రతి గ్రంథమందును పొడగట్టి మన సార

స్వతములోఁ బ్రత్యేకస్థానమును గడించినది. ఈ గద్యస్వరూపము కేవల వచనమునకును, కేవల పద్యమునకును మధ్యస్థితినాక్రమించుచున్నది. వీనిలోఁ గొన్నిగద్యలను బాడుదురు. ఆ చదువు పద్ధతియే భిన్నము. (తెలుఁగు సారస్వతపు తొలిదినములకే 'రుద్రగద్య' మొదలైనవి యున్నవి. వీనిలో లయ (Rythm) ఉన్నదనియే తలంపవలెను. * )

మన సారస్వతములో 'దండకము' లనునవి కన్పించుచున్నవి. ఏవిధముగా కవితాభావము లేని పద్యమువచనముగా ముందు కాంచితిమో, యట్లే 'దండకము' వచనముగా భాసించినను, లయ (Rythm) కలదిగనుక పద్యతుల్యమగుచున్నది. (ఈ దండకములు సమస్థార గద్యలకు తుల్యములు.) నన్నయతరువాత పాల్కురికి సోమనాథుని కాలమునకే గద్య ప్రబంధములు విరివిగానుండి సంస్కృతపద బాహుళ్యము వలన జనసామాన్యమునకు రుచింపకపోయినట్లు పండితారాధ్య చరిత్రలో—

'ఆరూఢగద్య పద్యాదిప్రబంధ, పూరితసంస్కృత భూయిష్ఠరచనమానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు.

మఱియు బసవపురాణములో—

'ఉరుతరగద్య పద్యోక్తులకంటె, సరసమైపరగిన జాను తెనుంగు చర్చింపగా సర్వసామాన్యమగుట.'

* "కావ్యము లనిపించుకొనిన వచనములు గద్యములు. కావ్యేతర వచనములు వచనములే!" —శ్రీ పింగళి లక్ష్మీకాంతం.

ఇట్టఁ జెప్పిన గద్యగ్రంథము లేమాయెనో మృగ్యముగా నున్నవి. లేక, 'గద్యపద్యోక్తి' అనియు, 'గద్యపద్య ప్రబంధపూరిత సంస్కృతభాషామిశ్రరచన' అనియుఁ బేర్కొన్నపుడు గద్యపద్యములచేఁ జెన్నొందు చంపు వనియేమో యుద్దేశము!

స్థూలముగాఁ దెలుగు సారస్వతమును జూచినచో రెండుగా విభాగింపబడినట్లు తెలిపితిమి. (సంస్కృతప్రభావము భాసించిననాటినుండి వరలిన సాహిత్యమును రెండుశీర్షికల క్రింద విభాగింపవచ్చును; మొదటిది పురాణరచన (The Narrative) రెండవది ప్రబంధరచన (The Descriptive). ఈ రెండు ప్రక్రియలలో నొకే కథ, రచనాశక్తిచే, నవకాశాను గుణముగ వైవిధ్యమును బొందగల్గును. ఇందులకు పురాణస్థ గాథలను ప్రబంధవస్తువుగా స్వీకరించి, నిర్వహింపబడిన ప్రబంధములగాంచిన తెలియును.

ఇఁక పురాణప్రబంధవచనములను పరిశీలింపవలయును. అపుడు వచనమాంధ్రమున నభివృద్ధిపొందెనో, లేదో తెలియ వచ్చును.

పురాణములోను, ప్రబంధములోను గన్పించు వచ నము భిన్నస్వరూపమును బొందినది. పురాణవచనము పద్య ములమధ్య నెడనెడ గన్పట్టును. ఈవచనము కేవలము రెండు పద్యముల నడుమగాని, రెండు సన్నివేశములకు సంబంధ వాక్యముగాగాని వినియోగపడును. ఒకొక్క

యెడ నిరువుర సంభాషణము పద్యములలోఁ జిత్రించిన, నా యా పాత్రలను సూచించుటకై వచన ముపయుక్తమైనది. ఇట్టి విధానముతో వచనము పురాణములోను, ప్రబంధమందును విరివిగా గన్పించుచున్నది. (పురాణవచనము పురాణ పద్యమువలెనే సుబోధకము (ఆఖ్యానాత్మకము) అల్పపద్య వాక్యమయము. అయ్యది నిరాడంబరముగను, నాతిదీర్ఘముగను, విషయప్రధానముగను, కథాగమనవేగముతోడను నడచుచుండును.) కాని, ప్రబంధములలో వచనమున కొక ప్రత్యేకత యున్నది. ప్రబంధవచనము దీర్ఘముగను, అలంకారికముగను, వర్ణనాత్మకముగను, సమాసగుంఫిత ఫణితితోడను, పద్యమునందువలె శబ్దాలంకారములతోడను విజృంభించియుండును. (కాని, భాగవతముమాత్ర మిడ సరితూగదు; పురాణవచనమువలె భాసిలక, ప్రబంధరీతి ననుసరించినది. ప్రబంధవచనములో కథావేగమునకై త్వరపడుట లేదు. మీదుమిక్కిలి కథాస్రవంతి యావచనమను పర్వతమునొద్ద నొక్కుమ్మడి యాగి, తదుపరి యా వచనపర్వతము నధిగమించి చనుచుండును. కథలోని సన్నివేశముల నెక్కుడుగా వర్ణించుటయే ప్రబంధకవిత్వ లక్ష్యము. కనుక, కథావేగమున కాతని పద్యరచనగాని, వచనరచనగాని పూనుకొనదు. సన్నివేశ (incident) ప్రస్తారమే కవియొక్క యుద్దేశ్యము. ఇట్టి ప్రబంధవచనములలో నెక్కుడు స్వభావోక్తి యొప్పును.

ఈ విధముగా పద్యమునకు భిన్నమైన వచనరచనము మనకు తొలుదొలుత శాసనములం దంకురించి, తరువాత చంపుకావ్యమైన భారతములో పద్యముతో నెడనెడ నడ

చుచు వచ్చుచు కావ్యాంతములందు విలక్షణముగా 'గద్య' లను పేర బరగుచు, కావ్యములు అనిపించుకొను గద్యలలో పొడసూపుచు, ప్రబంధ యుగమునాటికి సలంకారముల గ్రహించి విశిష్టరూపమును పొందినట్లు తెలియుచున్నది. ఎట్టె నను ప్రబంధయుగముత్తరాంతనే వచనప్రయోగము సంపూర్ణముగా గుర్తింపబడినట్లు నమ్మవలసియున్నది. ఆంగ్లవిద్యా ప్రభావము కారణముగా గత రెండు శతాబ్దములనుండి వచనరచన సర్వోపభోగ్య మగుచున్నట్లు గమనింతుము. ఈ క్రమపరిణామము నోపికతో ముందు గమనింతముగాత!

# ఆంధ్ర వచన స్వరూపము

## అన్వయము



## రెండవ భాగము

నన్నయ భట్టుగాని, తిక్కన యెఱ్ఱనార్యులుగాని వచనమును కథాకథనపద్ధతికి ననుగుణమై గౌణమైన వాహిక (medium) గాస్వీకరించినట్లు ద్యోతిలును. ఇఁక వారి రచనలోమాత్రము భేదము వర్తించుచున్నది. ఇది వారి వారి యాత్మీయత (Personality)లను పురస్కరించుకొని వచ్చిన శైలీవైవిధ్యవిన్యాసవిలసనమే. (భారతరచనలో నన్నయ యేవిధమైన యాఖ్యానాత్మక శైలిని ప్రదర్శించెనో, తిక్కన యెట్టి నాటకీయ శైలిని నడిపించెనో, ఎఱ్ఱన యేవిధమైన వర్ణనాత్మక శైలిని పుణికిపుచ్చుకొనెనో, యట్టి శైలీవైవిధ్య మాకవుల వచన రచనలందును తగుమాత్రముగ గన్పించుచునేయున్నది.) అనఁగా నన్నయ వచనమునకు కథాకథనశక్తియున్నట్లు, తిక్కయజ్వ వచనమునకు సంభాషణాశక్తియున్నట్లు, ఎఱ్ఱనామాత్యుఁడు వచనమునకు వర్ణనాశక్తియున్నట్లు మొట్టమొదట

చూచిన ద్రష్టలు. ఈ విధముగా వచనము త్రిముఖముగా తిరుగగలదని తీర్చిదిద్దినవా రా కవిత్రయమువారే. కాని ముఖ్యముగా వచనమునకు వారి రచనలలో ప్రాముఖ్యత లేదనుటకు వీలులేదు. వచస్గ్రంథము లానాఁటికే యున్నట్లు శైవకవుల పొత్తములలో హాస్తింపబడియున్నది. ఆ తర్వాత వచ్చిన తిక్కనామాత్యునకు తన యుత్తరరామాయణమును రచించు తలఁపు పుట్టినపుడు వచనరహితముగా రచనసాగింప వలెనను దీక్షవహించుటనుబట్టి యానాఁటి వచనస్వరూపము ద్యోతిలగలదు. నాటి దీర్ఘవచనములను సాగించుట ఎఱ్ఱనా మాత్యుఁడు తీసినదారియే. ప్రబంధోచిత వర్ణనలను నృసింహ పురాణ హరివంశములందు విలోకించినవాఁ డాతఁడే. వచన ములో భావస్పష్టీకరణశక్తియున్నట్లు నన్నయ వచనములలో తెలియును; సంభాషణాచాతురి వచనరచనలో నున్నట్లు తిక్కన పరిశీలించె; భావప్రస్తారమునకుగాని, భావవ్యాఖ్యా నమునకుగాని వచన ముపయుక్తమగునని శంభుదాసుఁడు కని పెట్టె. ఇవ్విధముగా కవిత్రయ వచనరచన మూఁడుచిన్నెలు పొంది చెలువారుచున్నది.

కవిత్రయమువారి ననుగమించిన కవులలో ననేకులు వారి మార్గముల ననుసరించినవారే. అట్టి యనుసరణమే వచనమందును గన్పించుచున్నది. కాకపోయిన, వచనమున కున్న మూఁడుశక్తులను (పైఁ బేర్కొనిన శక్తులు) పరిశీలించి, ముప్వురి ఛాయలను సంక్రమింపఁజేసికొన్నవా రనేకులున్నారు.

మరల కవిత్వములోగాని వచనములోగాని ప్రత్యేక విశిష్టతలు వచ్చిన వసిన శ్రీనాథుని హస్తములందే యని చెప్పవలయు.

శ్రీనాథుని కవితలో నొక మార్పు వచ్చినట్లు సూచించితిని. కవిత్రయముచే దిద్దిపెట్టబడిన పురాణ లేక ఇతిహాస వైఖరి కొంతకాలము వర్ధిలి, శ్రీనాథునినాఁటికి కావ్యఫణితి లోనికి పరివర్తనము పొందినది. ఈ వైఖరీభేదముతోఁ బాటుగ రచనాపద్ధతిలోను భేదము వచ్చినది. స్వతంత్రాలంకారములచే నాకావ్యయోష నలంకరించుట శ్రీనాథునితో మొదలు పెట్టబడె. మూలమును యథాతథముగా ననుసరించుట లీతని రచనలో స్వల్పము. శ్రీనాథుఁ డెటనున్నను తన వ్యక్తిత్వమును జూపెట్టును. నైషధ కావ్య మందలి పద్ధతి యిందుల కుదాహరణము. కొన్ని శ్లోకముల ననువదించుటలో వచనముగా ననతరింపఁ జేసినాఁడు. దానిలో నాతని యశక్తత గాక, యా మూలశ్లోకములలోని వాచ్యత (Baldness) యే కారణ మనవలసియున్నది.

ఉదా. కిమస్య రోమ్ణాం కపటేన కోటిభిః విధిర్న రేఖాభిరజీగణ
ద్గుణాన్ నరోమకూపౌఘమిషా జగత్కృతా కృతా
శ్చకిం మోహణ శూన్య బిందవః ॥

మొదలైన శ్లోకములను వచనమందుంచె జూడుడు:

" ......రోమకోటి కపటంబున హాటకగర్భుండు పాటించిన సుగుణగణనా రేఖ లవయవంబులం బొలుపారె"

శృం. నై.

ఇవ్విధముగా శ్రీనాథుఁడు వచనముయొక్క ప్రయోజనమును గ్రహించెను. కథాకథనమున నెక్కుడుగా వచనమే యుపయుక్తమని తెలిపినాఁడు. అందుచేతనే శ్రీహర్షుని శ్లోకములను వచనమందు దింపినాఁడు. ఇదిగాక శ్రీనాథుఁడు కావ్యధోరణి ననుసరించినవాఁడు కనుక, యది వచనమందును దొరలినది. దీర్ఘసమాసములతో వచనము నలంకరించినాఁడు. వర్ణనలను మఱింత బరువు గావించెను. అనుప్రాసాలంకారముల యొప్పు, శ్రవఃపేయతకు పాటుబడినాఁడు. ఈ క్రింది వచన ముదాహరణ మగును.

"వెండియు నవఖండమండలంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుంబోలె భీమేశ్వర మండలంబు పొలుపునఁ ద్రిలింగోత్కలతలంబులనందు, వింధ్యాచల పాదంబునఁ గేదార కుంభకోణార్కస్థానంబుల కుపమానంబనఁజాలి, యేలేటి మేటికాలువలవలన నదీమాతృకంబులగు పంటవలంతులు సలిలధౌతకలధౌతశలాకాశకలసంకోచకరణంబులై యంకురించినవియు......"

శ్రీనాథుఁడు కాశీఖండంబున 'సదాచారనిరూపణము' 'స్త్రీలక్షణ నిరూపణము', 'యోగ నిరూపణము' లను జేయునపు డెక్కుడుగా వచన ముపయోగించి వచనప్రాశస్త్యమును నిరూపించెను. అట్టి నీతిబోధలకు, శాస్త్రవిషయములకును వచనమే యుపాదేయమని గ్రహించినట్లు స్పష్టముగదా! ఈతని జటిల వచనరచనఁ జూడుఁడు:

... ... ... జంభ... పురందరాది బృందారక
మకుటసంఘాసితవికచమందార కుసుమమాలా మకరంద
బిందుధారాధౌతచరణారవింద మందరాచలమంథానమథ్య
మాన దుగ్ధజలధిగర్భావిర్భూత కాలకూట కబళితభయ...
గండూషకళంకితకంఠమూలో... సకల... భువనరక్షా
దాక్షిణ్యదాక్షాయణీకుచకలశపాళీకేళి" కా. ఖం. చ.

అనఁగా శ్రీనాథునిచేతిలో వచన మొక నూతన్న మర్యాదాశ్రయి యైనదని సిద్ధాంతము. పోతన శ్రీనాథుని సమకాలీనుఁడైనను, 'భాగవతము' కావ్యముకాదు గనుక యితిహాస వైఖరినే తన రచనలో ప్రతిపాదించి ప్రయోగించినాఁడు. (కాని పోతన కవిత్వములో గణింపఁదగిన ప్రత్యేకత, గద్యమందును పొందినాఁడని చెప్పవలయును.) అంత్యానుప్రాసముతో రచించు పద్ధతి యాతనిసొమ్ము. వర్ణనలందు దీర్ఘసమాసయుక్తముగను, కథాకథనమందు లలిత పదములతోఁడను రచనను సల్పఁగల సవ్యసాచి పోతన.♦

ఇఁక శ్రీనాథుని తరువాతివారు గతానుగతికంబుగ నాతని రచననే యనుకరించిరనవలెను. పినవీరన శాకుంతల కథను స్వీకరించినపుడు శ్రీనాథుని భాషాంతరీకరణ పద్ధతినే యనుసరించెను. జక్కన, అనంతామాత్యులు తమరచనలలో కథాకథనపద్ధతికి ననువైన రచనసల్పి, వచనములను తదనుగుణముగానిర్వహించిరి. జక్కన తన 'విక్రమార్కచరిత్రము'

♦......"జలధర నినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండు......" 8 స్కం. (భాగవతము)

లో ప్రథమాశ్వాసమున పురవర్ణనమును వచనంబులో నిలిపి నాడు. దీనిఁబట్టి వర్ణనాత్మకమైన శైలి వచనములో నెంతవఱకు నెగ్గునో నిరూపితమగును. ఇక్కడి వచనములు సమాససంభరితములు, శబ్దాలంకార విలసితములును. శ్రీనాథుని వచనరచనము ననుగమించినారు రాతని తర్వాతికవులు,

కవిత్రయమువారి తరువాత మరల శ్రీనాథుఁడే తెలుఁగు సాహిత్యమున క్రొత్తతీరు దిద్దినాఁడు. అది పెద్దనకాలము వఱకు సాగినది. పిమ్మట పెద్దన పెద్దవాఁడైనాఁడు. కృష్ణరాయులదర్బారు సాహితీరంగస్థలమైనది. ఎఱ్ఱాప్రెగ్గడచే శంకుస్థాపన చేయఁబడి, శ్రీనాథునిచే పరికరములు సమకూర్పబడి పెద్దనచే ప్రబంధ సౌధనిర్మాణము గావింపఁబడినది. తరువాత పంచరత్నకారుఁడు సౌధాంతర్భాగములకన్న సౌధోపరిభాగముల నలంకరించినాఁడు. తరువాతి కవులందఱు ఆ సౌధములలోనే వర్తించిరిగాని, మఱి యేమియు జేయలేదనవలెను. ఇట్లు పదునెనిమిదవ శతాబ్దమువఱకు సాగినది. ప్రబంధములలోని వచనము, పైన నుడివినట్లుగా, పద్యబంధ పద్యసరణినే నడచినది. అట్లనుగుణముగ లేనిచో సమత (Balance) యుండ నేరదు. పెద్దన పెట్టిన యొరవడిని కథాకథనమందును, కథాసన్నివేశ కల్పనమందును, అంగాంగిరసనిర్వహణములందును, విషయ విభజనమందును, తరువాతికవులు చాల వఱకనుకరించిరి; ఇట్టి రచన గతానుగతికమై కవిసమయము (Convention) వలె పరిణమించినది. (ఈ ప్రబంధములలో ద్వితీయాశ్వాసమున (రించుమించు) తప్పక యొకదీర్ఘవచనము పొసగియున్నది.) దీని వైశిష్ట్యమే మనః-శబ్దాలంకారము తప్పక

యుండుట; యమకము, అనుప్రాసములు వరలుచుండుట; ఇవి సమాసములోనుండి వర్ణనాసందర్భములో రచింపబడుట: ఉదాహరణములుగా జూడుడు:—

కోలాహల పర్వతవర్ణనమును జేయుచు వసుచరిత్రకారుడు:—'మఱియు సిక్కాలాచల సంతానంబు, సంతాన కుసుమ వాసనా సమాగత సారంగసంగీత భంగీతరంగంబులుపాంగంబులుగాఁ బాడు వేల్పుగాణీల పాణీరిత మాణిక్య వీణా మధురరావామృతంబులఁగరగి, పెచ్చు పెరుగు నచ్చపు బచ్చలచాయలు మెచ్చులుసేయఁ బచ్చికల మచ్చికల విచ్చలవిడిఁ గ్రుచ్చుకొని మెసవ నుంకించు నంకపు రాజంకి జంకించి...' మనుచరిత్రలో వేటను వర్ణించు సమయంబున పెద్దన పెద్ద వచన రచనమున కుద్యుక్తుఁడాయె. ఈ వచనమును అనుప్రాసాలంకారములతో నున్నది. ముక్కుతిమ్మన యొద్దికగా తన ముద్దుపలుకులతో గద్యమునుదిద్ది పెద్దనాదుల కుద్ది యనిపించె:

'అంధకారబలీంద్ర నిర్బంధన ధురంధర సమయమధు మధన చరణాంగుష్ఠనిష్ఠ్యూత గగనసరిదంబుపూరంబుల కను బింబంబులై ... ...' అను రచన ముదాహరణము చాలును.

పింగళి సూరన ఆఖ్యాన శైలిలో రచనను సల్పినాఁడు. ఆతని కళాపూర్ణోదయ మిందుల కుదాహరణ మగును. ఇందలి వచనములలో ముఖ్యముగా నెన్నదగినది కథలోని కల్పనల యావిష్కరణ సమయమందు విరచించిన వచనము. సరస్వతీ చతుర్ముఖుల విలాసమును విప్పి చెప్పి

నప్పుడు వచనమే యుపాదేయమని తలంచినాడు సూరన. ఇట్టి క్లిష్టవిషయము పద్యమునకన్న వచనమందు విపులముగా వివరింపనగును గదా !)

ఇట ధూర్జటినిగూర్చియుఁ జెప్పవలసియున్నది:

ధూర్జటి చాల స్వతంత్రుడు. కృష్ణరాయలకాలములో నున్నను, అతని కంకితము చేయక కాళహస్తీశ్వరునికే కృతి సమర్పించిన ప్రత్యేకతగలవాఁడు. ఈతఁడు తన కవిత్వమందును స్వాతంత్ర్యము వహించెను. ఇతఁడు తన వచనరచనలో యుద్ధమును వర్ణించుతటి. వేటను వెన్నెలనట్టి సందర్భములందును, సహజప్రతిభతో స్వభావోక్తి ప్రధానముగా రచించె.

రామకృష్ణుఁడు తన పాండురంగమాహాత్మ్యములో వచనరచన సన్నివేశములను వర్ణనోచితపద్ధతుల కల్పనగట్టి నట్లుచేసెను. నిగమశర్మ యక్క వచ్చిన సందర్భమున నా యింట జరిగిన విశేషములను చక్కగా వచనంబున పొందు పఱచినాడు. 'పాండురంగవిభుని పదగుంఫనము' ప్రతిష్ఠ మున గన్పించును. ఈ పైసందర్భమున నూతన్న వచనములో రామకృష్ణుఁడు నిగమశర్మ శరీరముయొక్క కర్కశత్వమును కుకవిపదబంధమునకు జోల్చి తన యాధిక్యమును ప్రకటించె. పాత్రచిత్రణమందు వచనమెంత దోహదభూతమో యుదాహరించినాడనవలెను.

ఆంధ్రకవికులభోజుఁడైన శ్రీకృష్ణరాయలు రచించిన ఆముక్తమాల్యదలో ననేక వచనములు గన్పించును. కృష్ణ

రాయలు వర్ణనలం దుత్తమోత్తము రచయిత యని ప్రాజ్ఞుల తలంపు. ఆముక్తమాల్యదలోని విషయమును సుదాహరణా ములు మిక్కుటము మతసంప్రదాయ సిద్ధాంతములను రాయలు చక్కగా నెఱిఁగియుండెను. వాసని తన గ్రంథమం దంతటను వెదజల్లినాఁడు. (ఆముక్తమాల్యదలోని వచనరచన జూచినచో తత్త్వవిషయకమైన శోధన మంతటిని వచనమే చక్కగా నిర్వహించున దని తేలును.) ఇప్వాఫముగా ప్రబంధ ములలో వర్ణనలకు, తత్త్వవిషయములానిగాగల శాస్త్రవిషయ ములకు వచనమే యుపాదేయముగాని పద్యము కాదని ఋజు వయినది.

ఇఁక దక్షిణాంధ్ర వాఙ్మయములో వచనస్థాన స్వరూ పములను గమనింతము. వచనములోఁ గ్రొంగ్రొత్తగా కావ్య సృష్టి యీ నాయకరాజ యుగమునందే జరిగినది. పద్య కావ్యముకన్న వచనకావ్య మెక్కువగా సులభగ్రాహ్య మని కవు లెఱింగిరి. అనేక ప్రక్రియాభేదము లీయుగమం దుద్భ వించినవి. యక్షగాన మీనాటిదే. గీతికి (Lyric) ప్రాధా న్యమువచ్చిన దీ దినములందే. ఆనాఁటి కవులు గతానుగతి కముగా గాక, ప్రత్యేకమార్గమును ద్రొక్కి తమ ప్రతిభను అసమానముగా నందజేయవలెనని సంకల్పించిరి. తదనుగుణ ముగా సార్వభౌముల సాహితీ పిపాస చేతుల గలసినది. కృష్ణ రాయలవలె రఘునాథరాయలు సాహితీద్రష్ట; స్రష్టకూడ. నాయకరాజయుగమున వెలువడిన గ్రంథములలో ప్రబంధము లున్నను నవి పిల్లవసుచరిత్రలవలె గతానుగతికములుగాక ప్రత్యేకస్థానమును బొందగలిగినవై వెలుఁగుచున్నవి. వచనము

...త క్లిష్టములుగాక సుబోధ వచనరచనకు మార్గదర్శకములై వ్యావహారిక ప్రయోగములతో వ్రాయఁబడినవి

This prose is interesting contrast with the classical prose, and is full of colloquial idiom (cf. Taylor's Oriental Historical Manuscripts)

—S. Kuruganti

వచనరచనకు గడంగినవారిలో 'రాయవాచక' కర్తను,♦ ఏకరూచి బాలసరస్వతిని పేర్కొనదగును. భా[illegible] 'వ్యాఖ్యాన' మను ప్రక్రియను వెలుగులో సంతరింపఁజేసినాఁడు. కళువె వీరరాజు, సముఖము వేంకటకృష్ణనాయకుడు ముఖ్యముగా వచనగ్రంథముల రచించిరి. కంకంటి పాపరాజు ప్రబంధసరణిలో రామాయణకావ్య విరచనము సల్పెను. తన కాలమునాఁటి వచనశైలి యాతని గ్రంథములోఁ బ్రతిఫలింపక పోలేదు.

ఈయుగమందు వెలసిన రచయితల రచనములందలి వచనమును సూచించెదను: (కంకంటి పాపరాజు వ్రాసిన యుత్తరరామాయణములో వచనము స్వభావోక్తి ప్రధానము గను, పాత్రచిత్రణమున కనుగుణముగను పొడముచున్నది.) ఉదాహరణముగా, జానకీశోకఘట్టమున జానకి లక్ష్మణునిచే

♦ రాయవాచకము మధుర సేనాపతిచే రచింపఁబడినది. ఇందలిభాష వ్యవహారసిద్ధమైనది. "రథోత్సవమునకు విజయంచేయవలెను; అని విన్నపం చేయంగా దగ్గరవున్న దళనాయకులు ఆతీరున్నే రాయలవారు విచ్చేసి వున్నారు"

రామాజ్ఞ నెఱిఁగి, యవశయై చేష్పడియున్నతఱి నాపె యవసను వచనములో నెట్లు చిత్రించెనో కాననగును.♦ 7

(ఇట్లే రంభను రావణుఁడు మానభంగ మొనర్చిన పిమ్మట రంభయొక్క దుర్దశ వర్ణించినాఁడు వచనమందు:—

'బెబ్బులివాతికిం జిక్కియు జిక్కక మగిడిన హరిణి కరణి రాహుముఖగహ్వరంబునం బడి బయలుదేఱిన చంద్రకళ చందంబున ......... చెదరిన ముంగురులతోఁ బెదరిన బెళుకుచూపులతోఁ బ్రిదిలిన నివిబంధంబుతో వదలిన కేశపాశంబుతోఁ బగిలిన బింబాధరంబుతో నొగిలిన చెక్కుటద్దంబులతో ...... వాడిన విరిసరులతో వీడిన భూషణంబులతో ......ఆకారంబు దాల్చి వచ్చిన శోకరసాధిదేవత వలె నున్నదని వర్ణించె. ఇట వర్ణితములైన యవస్థలను సూచించుటకు సంతరింపఁబడిన క్రియాపదంబులు రెండు రెండుగా ననుప్రాసాలంకారసహితముగానుండి నడకలో బిగువును జాటుచున్నవి.

(సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడు తెనుగు వచన స్వరూపము తిన్నగా తెలుపుటకై సారంగధరచరిత్ర, జైమినిభారతము లను వచనకావ్యముల రచించెను. ఈతని

---

♦. "...పడి చేష్పడి బడిబడింబోడము ఒడలిక నొడలెఱుంగక రెండుగడియలుండి కొండొకతెలిసి వెండియుఁ గలసి యవశయై దీనదశం బొరసి, కృశాంగి మరలఁగన్నుదోరలి విచ్చి, విప్పలవిడి వెడలెడి యశ్రుధారాప్రవాహంబులు చెక్కుటద్దముల నైజాలువాఱ, ......పుగపురఁ బొక్కుచుఁ దాల్మిమాలి, స్రుక్కుచు శేచితూచ్చుండి... వెక్కివెక్కి యేడ్చుచు .....తలయూచుచు, దలయూచుకు విడిచి, ముక్కుపై వ్రేలు గీలుకొలుపుచు... హాహాకారంబు సలుపుచు......"

13
వచనరచన సులలితపదసమన్వితమై క్లిష్టాన్వయములు లేక, 'కులుకు కోకిల నణంచు గళరవంబు, పలుకుల సొరు' గలిగి తెనుఁగు తీయదనమును, తేటదనమును, తీర్చిదిద్దినట్లుండును. సంభాషణావిధానమును జిత్రించుటలోసైత మీ వచనము నిరాడంబరముగా సరసముగా నుండును. )

'జననీ! తక్కినవారికెంబలె యింత యుపచారంబేమిటికి? ఏను నీకుమారుండనుగానే' యనుటయు నాపువ్వుబోడి, బొమ్మంచు కెమ్మోవిచిగురునం జనునగవు మొలకలు గులుక, కప్పురంపువీడియంపు తావి ఘుమ్ముమన, తేనియ చినుకులొలుక నిట్లుపలికె; 'ఓజగన్మోహనాంగ! నా కుమారుండవగుదువు; నిక్కంబుపలికితివి. నీదు సుగుణత్వంబును, నీచక్కఁదనంబునీయొయ్యారంబు నిచ్చలులు నిచ్చలు పలుక విని వీనులకు విందులయ్యె. ఇప్పుడుకనుంగొనుటచే కన్నులకుం బండువయ్యె...'

(కళువె వీరరాజు రచించిన వచనభారతము, ) మఱి కర్తలెవరో తెలియని వచనములు, 'భారతచిత్రకథలు', 'బేతాళపంచవింశతి', మొదలైనవియనేకములున్నవి. విజయరంగ చొక్కనాధుఁడు 'మాఘమాహాత్మ్యము', 'శ్రీరంగమాహాత్మ్యము' లను వచనకావ్యములు రచించెను.) రామాయణ భాగవతములును వచనములోని కవతరింపఁబడినవి. శ్యామరాయకవి వచనరామాయణమును, పుష్పగిరి తిమ్మన వచనభాగవతమును గూర్చిరి. )

ఈ విధముగా వచనరచనవిరివిగా, పదునేను పదు నెనిమిది శతాబ్దులలో జరిగినది. వ్యావహారిక భాషా ప్రాధాన్యము చాల గ్రంథములలో నున్నట్లు తెలియగలము. (నాటి యక్షగానములలోని వచనముగూడ వ్యావహారికమే.) వచనగ్రంథములకు ముఖ్యముగా సుబోధకత్వమే ప్రోద్బలమిచ్చినది. ప్రజలకందుబాటుగా సాహిత్యము నుంచుటకుగాను దక్షిణాంధ్ర వాఙ్మయము పుట్టినట్లు ద్యోతిలును.) భారతభాగవత రామాయణములను వచనమునం దుంచుట, యక్షగానము ద్వారా ప్రజాభిరుచిని చూఱగొనుటలు తార్కాణములు గదా!

పూర్వోక్త ప్రకారముగా నాంధ్రభాషమీఁద నాంగ్ల భాషాప్రాబల్యము పందొమ్మిదవశతాబ్ది మధ్యకాలమునకు బాగుగావచ్చినది. ఆంగ్లవచనరచన యాంధ్రుల ననేకుల ముగ్ధులనుజేసినది. అట్టివాఙ్మయ మాంధ్రభాషలో నిర్మింప కుతూహలము సాహితీసేవకులకుజనించినది. ఇట్టిస్థితిలో చిన్నయ సూరి సర్వాతిశాయియైన గుణము కలిగించి వచన రచన చేసినాఁడు. (ఆంగ్లపాఠశాలలలోఁ దెలుఁగుచదువు విద్యార్థుల కుపయుక్తములగు సులభవచనములను రాయదుర్గము వేంకట నరసయ్య ప్రారంభించెను.) చిన్నయసూరిదృష్టియు నట్టిదే. కాని సూరి యాప్సితము పెద్దది! ఆలంకారికమైన వన్నె చిన్నెల నాపాదించి, శైలీసంపద ఘటించి, విరచించిన 'నీతి చంద్రిక' పిన్నలకేగాక పెద్దలకునాదరణీయమైన గ్రంథమాయెను. వచనరచనములో మకుటాయమానమైనది 'నీతిచంద్రిక.' ఆంగ్ల చనరచన ననుసరించి, వాక్యవిరామాదులను పాటిం

[illegible] సంస్కృతాంధ్రములను సొగసుగా పొందింపఁగలశక్తిమంతుఁడు సూరి. భావముగాని, భాషగాని, తొట్రుపడకయే గంభీరముగ నడిపింపఁగల ప్రతిభాశాలి. నన్నయభట్టు పద్యరచనము బట్టి దిట్టయో, వచనరచనమందు సూరి యంతటి దిట్టరి.

చిన్నయసూరి ప్రారంభించిన గ్రంథమును బూర్తి చేయుతలంపుతో వీరేశలింగము పంతులు, కొక్కొండ వెంకటరత్నముపంతులు ప్రయత్నించిరి. వెంకటరత్నముపంతులు రచన బిరుసుపాకమునఁబడినది. వీరేశలింగముపంతులు చిన్నయసూరివలెనే వ్రాయుటకై యత్నించి చాలవరకు మరపింపఁగల్గెను; కాని యది వీరేశలింగముపంతులు సహజశైలి కాదని, యాతని యితరవచనమును జూచినచో బోధపడగలదు. వచనమును సర్వోపభోగ్యమైన వస్తువుగాఁజేసి కేవల, మాధునికమగు వచనమునకు మార్గదర్శియయ్యెను. కావున ఆధునిక వచనమునకు మూలపురుషుఁడు వీరేశలింగముపంతులే యనవలెను. ఆంగ్లప్రభావము పూర్తిగాఁ బ్రతిఫలించినదాతని రచనయందంతటను; ఆంధ్రమున 'కథానిక'ను తప్ప మిగిలిన వచనమార్గముల ననుసరించినవాఁడు పంతులే. నవల, విమర్శనము, చరిత్ర, ప్రహసనము, వ్యాసము, ఉపన్యాసము, మొదలైన వచన ప్రక్రియాభేదముల సన్నిఁటి నవతరింపఁజేసిన గురువు శ్రీ వీరేశలింగముపంతులు. వీరి గ్రంథములన్నియు గావ్యములుగాక, విజ్ఞానోపలబ్ధి కక్కఱకు వచ్చునవిగా నున్నవి. స్వీయచరిత్ర వీరేశలింగముపంతులు వారితోడనే యాంధ్రమున నవతరించినది. పూర్వమున్న యాలంకారిక,

శాబ్దికవిమర్శనమును మాని, గ్రంథములపై నాధునికవిమర్శ నలు సల్పిన యాదిగురువు పంతులుగారే! నవలావాఙ్మయ మునకు శ్రీకారము పెట్టిన మహానుభావులుకూడ వారే! విమ ర్శనమందు పంతులుగారితోపాటు గురజాడ రామమూర్తి పంతులుకూడ నెన్నదగినవారు, కాని వీరేశలింగముపంతుల కున్న నిష్పాక్షికాభిప్రాయము, పరిశీలనాదృష్టి రామమూర్తి గారికున్నట్లు తోచదు.

ఇట్లీవిధముగా నూతనమార్గమున వచనము వీరేశలింగ ముపంతులవారి ముంజేతిమశికటకమన నాధునిక యుగమున వర్తిలినది. ఆధునిక యుగమునందలి వచనస్వరూపము నెఱు గుటకు ముఖ్యముగా విషయ విభజన మవసరమని తోచును. వచనములోవచ్చిన వివిధశాఖలక్రింద వివిధసేవకుల కృషి, తత్స్వరూపముల నెన్నుట యుచితము గదా!

వచనము బహువిషయముల కాలవాలమైనది. నవల, ఉపన్యాసము, విమర్శనము, చరిత్ర, శాస్త్రము, వ్యాసము- ఇవి వచనముయొక్క ముఖములు. వీనినాదరించి రచనసల్పిన వారి నెఱుంగుదము.

ఆనాఁడు వీరేశలింగము పెట్టినభిక్ష నేటికిని నవలవిష యమున ప్రాపఁగుచునేయున్నది. కాని, రచనములో, స్వరూ పములో, కథాసన్నివేశ కల్పనములో మార్పు లగుపించు చున్నవి. 'నవల' అను పదముమాత్ర మట్లేయున్నది.

(చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు జీవించియున్న నవలారచయితలలో ప్రథమగణ్యులు.♦ వీరివచనము మృదువైనది. వీరేశలింగముగారి రచనలోని సారళ్యముతోపాటు వీరి రచనకు సౌకుమార్యమబ్బినది. హాస్యముకూడ కడు మేలైనదే. రామచంద్రవిజయము, గణపతి, సౌందర్యతిలక, [illegible], సుధాశరచ్చంద్రము వీరి గొప్ప నవలారచనలు.) చారిత్రక నవలలో చిలకమర్తివారి ద్వితీయులేమో యనునట్లు 'హేమలత', 'రాజస్థానకథావళి' చెలగుచుండును.

నవలారచయితలసంఖ్య బాగుగా నాంధ్రమున పెరిగి పోయినది. ఇట్లు తండోపతండములుగా వచ్చుచున్న వీరిలో మంచిచెడ్డ లేరుట కర్తవ్యముగాదు. ఈరచయితలందఱు వచనరచనమునకు తోడ్పడిరనియే చెప్పవలయును. కొందఱు భాష చాల జటిలముగా నుపయోగించిరి. కొందఱు ద్రాక్షాపాకములో పొంకముగా రచించిరి. (వేంకట పార్వతీశకవులు పేరెన్నికగన్న నవలారచయితలు. వీరి 'ప్రమదావనము' చక్కని ఆంధ్రనవల.) వేంకట పార్వతీశకవులు నవలకొక విశిష్టమైన వచనరచన నాపాదించి, పండితపామరహృద్యముగా రచనసాగించిరి. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి వచనరచన చాల క్లిష్టమై వచన ప్రయోజనమునకు సుదూరమై వర్తిలును.

---

♦ "కవులప్రతిభకు నికషాయమానమగు గద్యప్రబంధరచనమున వన్నెకెక్కిన యల్పసంఖ్యాకులగు నాంధ్రకవులలో గణనీయులు......"

—ఆంధ్రవిశ్వవిద్యాలయపట్టప్రదానోత్సవము.

(నవలారచనలో వచనము చాల కాలమునకు, అనగా గిడుగు రామమూర్తిపంతులు వ్యావహారిక భాషావాదము నుద్ఘాటింపక పూర్వము, గ్రాంథికములోనే భాసిల్లినది.) గ్రాంథిక వచనమును వశ్యము జేసికొనినవారలకు కృతక భాషగాక, వ్యాకరణసాధ్యములౌ పదములను, కారకములను ప్రయోగించునట్టి భాష కాక, వ్యవహారమునకు సహజముగా నుండు భాష ప్రయోగించిన నది చాల హృద్యముగా నుండును. వ్యావహారికము పేర వ్రాయబడుచున్న నేటి గ్రంథములలో గాని, భాషించు ఉపన్యాసములలో గాని ఉన్న భాష సామాన్య జనుల కెంతవరకు సుబోధకముగా నున్నదో ప్రాజ్ఞులు, ద్రష్టలు తెలియగలరు. మాండలిక భేదములతో[1] మూర్తీభవించినట్లు దురవబోధ మగుచున్నట్లును తెలిసిన విషయమే గదా! క్రియాపదములను మాత్రము త్రుంచి, సమాసభూయిష్ఠ రచన సల్పుచున్నవా రనేకులున్నారు. జమ్ములమడక మాధవ రాయశర్మ రచన మిందుల కుదాహరణ మగును. ఇట్లుగాక, సామాన్యమానవుని కర్థమగు లలితశైలితో గ్రాంథికము నారాధించినవారు వీరేశలింగము, విశ్వనాథులని చెప్పవలెను. ఇయ్యది వారి రచనలలో గాననగును. ఈరచన నవలోకించిన సామాన్యులకును సుబోధకముగా రచించుటకు వ్యావహారికమే యక్కర లేదనియు, గ్రాంథిక వచనములో గూడ పండిత పామర హృద్యముగా రచనసల్పవీలున్నదనియు తెలియగలదు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులువారి 'మాలపల్లి' లోని వచనము సుబోధమే; దీనినే తేట తెనుగందుము.

[1] మాండలికములను గూర్చి Ernest Hornwitz—

"Books written in a dialect are slow to travel beyond the pale of the province where it is spoken, but, a classical tongue like Sanskrit spreads quickly over a wide geographical area"

అని వచించినారు.

అయితే, యీ మాండలిక శబ్దములను గణి కల్పించుటకుగాక పద్ధినగాని చేసినచో వచ్చు నష్టము మహత్తరమైనది.

(ఇంక యుపన్యాస రచనమునందు, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు పేర్కొనతగినవారు. వారి 'సాక్షి' వ్యాసములలో గానగు వచనస్వరూపము మానవ్యసాధారణము.) ధారాశుద్ధి, విషయసౌందర్యము, ఉపన్యాసశైలి, వచన రచనల ప్రతిమానములు. అందరికిని సుబోధముగా నున్న రచన యిది. 'ఆంధ్ర ఎడిసన్' అనిపించుకొనిన సమర్థుడు.

(విమర్శనములో వచన రచనమే యుపయోగమైనది కాని కొందరు — వేదము సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల రామలింగస్వామివంటివారు — విమర్శలకూడ పద్యములలో రచించిరి.) వచనరచన సల్పిన విమర్శకులను చారిత్రక విమర్శకులనియు, సాహిత్య విమర్శకులనియు విభజింపవలెను. సాహిత్య విమర్శకులలో పూండ్ల రామకృష్ణయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, కాశీభట్ల సోదరులు, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పురాణం సూరిశాస్త్రి, శే. వెం. రాఘవయ్యంగారు మున్నగువా రెందరో యున్నారు. వీ రందరిలో ముట్నూరి కృష్ణరావుగారు అగ్రగణ్యులు. వారి 'సమీక్ష' యిందులకు నిదర్శనము. నిర్దుష్టమైన, యుదాత్త

ష్టమైన వచనరచన స్వరూపమును వస్తువున కనుగుణముగా రచించిచూపిన మేధావి కృష్ణరావుగారు. డిక్కెన్సు మొదలగు రచయితలతో నించుమించు చేతులుకలిపినా డనవలెను.

మన పురాణగ్రంథములను వచనములోనికి దింపి, సర్వోపభోగ్యముల గావించిన నోరి గుర్లింగశాస్త్రి, నాగపూడి కుప్పుస్వామయ్య, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి మున్నగువారు స్మరణీయులు. (అనేక పండితులు గ్రంథపీఠికారూపమున విమర్శనల సల్పుచువచ్చిరి.) ఈ వచనరచన క్లిష్టముగాదు; అయినచోఁ బ్రయోజనము చెడునుగదా! మేడేపల్లి వెంకటరమణాచార్యులు, దేవరాజసుధి, జయంతి రామయ్యపంతులు, వేటూరి ప్రభాకరశాస్త్ర్యాదు లనేక పీఠికలు రచించి వచనోపాసకులైరి.

చారిత్రకులలో కొమర్రాజు, మల్లంపల్లి, మారేమండ, భావరాజు, కురుగంటి, మల్లాది, పింగళి, దువ్వూరి, భోగరాజు, కేతుమళ్ళ, నల్లూరి, దిగవల్లి, మానికొండ, కవిత్వవేది, వంగూరి, చిలుకూరి, రాయసము, కోరాడ, గంటి మున్నగువా రున్నారు. వీరిలో కొందఱు సాహిత్యచరిత్రకు, కొందఱు భాషాచరిత్రకు, కొందఱు రాజకీయచరిత్రకుఁ గడంగి, సేవచేయువా రున్నారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు స్మరణీయులు; పరిశోధనాపద్ధతికి దారితీసిరి. శాస్త్ర రచయితలలో సి: ఆర్. రెడ్డి, ఆత్మకూరి గోవిందాచార్యులు, గుళ్ళపల్లి నారాయణమూర్తి, కాళీపట్నం కొండయ్య, వఝులవారు, అప్పన్నశాస్త్రి మున్నగువా రల్పసంఖ్యాకులున్నారు.

వ్యాఖ్యాత లనేకులు వచనము నారాధించుచున్నారు.

వ్యాసరచనమునకు వచ్చినచో సిగ్గగునని చెప్పక తప్పదు. పత్రికాముఖముగా వెలువడు వ్యాసములు వ్యాసములు కానని యనవి. వ్యాస మనఁగా కేవల విషయప్రాధాన్యము కలది కాదు. ఏ చిన్న విషయమునైనను రచయిత భావాధిక్యముచే కేంద్రీకరించి, విస్తరించి, అంగాంగీభావ నిర్వహణముచేసి, యుదాత్తమైన శైలీసంపదతో విరచనచేసి కావ్యత్వ మాపాదింపవలెను. (పద్యమువలె వ్యాసమునకు గూడ రసమే ప్రధానము.) (ఈ కారణముననే ఆంగ్లసాహిత్యమున వ్యాసకర్తల రచనములను విమర్శకులు కావ్యముక్రింద జేర్చిరి.) ఇట్టి వ్యాస మను ప్రక్రియ లేని లోపమును మన యాంధ్రసాహితీసేవకులు తీర్పవలసియున్నది.

మనకు 'కథానిక' నూతనముగానే వచ్చినదని పలువుర యాశయము; కాని పూర్వమిది వర్తిలినటుల మథించిన వారు తెలియగలరు. మన యాంధ్రగృహములలో ముసలివారు చెప్పుపద్ధతి, వచనమాధుర్యము లప్రతిమానములు. ఆ సాంప్రదాయమును విస్మరించరాదు. 'కథానిక' నేఁటి సారస్వతమున ముఖ్యస్థాన మాక్రమించి వచనరచయితల ననేకుల ప్రేరేంచుచున్నది. చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావుమున్నగువారు ప్రసిద్ధులలో కొందఱు. కథాకథన పద్ధతికి వచన మెంతవఱకుపాదేయమో

... ... పత్రికల వచనవాటికలు బయలు దేరి వచనరచనకు దోహదభూతము లగుచున్నవి.)

పత్రికలు వచనము నుపాసించు నిలయములు. 'Journalism' ఇతరప్రాంతములలో గొప్ప విషయము. అది ప్రత్యేక శాస్త్రము. అట్టిది తెలుగులో బాగుగా ప్రవేశింపవలసి తెలియవలెను.

నేఁ డాంధ్రమున శాస్త్రవాఙ్మయము వచనములోఁ దారసిలవలెనని యత్నములు జరుగుచుండుట ముదావహము. అన్నిట వ్యావహారిక రచన యుపాదేయ మగుచున్నది. దీని విషయమై ముందే తెల్పితిని.

ఆంధ్రవచన వాఙ్మయము నొక్కమారు సింహావలోకనము చేసినచో నైదు విధములైన విభజనము పొడ[illegible] :

1. పద్యముతో వేఱుపఱుపరాని పురాణవచనము.
2. ప్రబంధముం దాలంకారిక శైలీవిన్యాసముతో నొప్పిన వచనము.
3. ప్రజానీకమున కంచుబాటులో నుండునట్లు రచింపఁబడిన వ్యావహారిక వచనము.
4. చిన్నయసూరి, కొక్కొండ వెంకటరత్నంపంతుల వారి జటిల గ్రాంథిక వచనరచనము.
5. వీరేశలింగము, విశ్వనాథుల సుబోధము, సులలితము గు వచనరచనము.

# రూపక ప్రకాసము

౧

సాహిత్యము [illegible] వ్యాపమైనది. కావ్యము దృశ్య శ్రవ్య భేదములచే [illegible] నది. దృశ్యకావ్యమునే రూపకమని లాక్షణికులు [illegible] ంచినారు. ధనంజయుని నిర్వచనము ప్రకారము నాట్య [illegible], రూపకమను పదములు దృశ్యకావ్యమునకు [illegible] నున్నవి. అవస్థానుకృతి నాట్యమనియు, నటులచే దృశ్యరూపంబగుట నది రూపకమైన దనియు, నటులయందు పాత్ర సమారోపముచే వర్తిలునది గాన రూపకమైనదనియు, దశరూపకమందు దాని సూత్రము నే డీ మూడు పదములు మరుగుపడిపోయి నిత్యవ్యవహారములో నాటకమను పదముమాత్రము రూఢమైనది, కాని నాటక మనునది 'అపంచాంక మాదశాంక'మను ప్రత్యేక లక్షణముగల దశవిధ రూపకములలో నొకటిగా ధనంజయుడు పరిగణించినాడు. ఈనాడు వ్యవహరింపబడు రూపకములు వైలక్షణమున కవ్యాప్త్యతివ్యాప్తిదోషములకు గురియగునవే యనుట నిశ్చయము. కాని నాటకమను పదమును సామాన్య రూపక వాచకముగా గ్రహించుచున్నట్లు గమనించిన నే దోషమును పట్టదు.★

---

★ ఈ విమర్శకు దావులేకయుండు రూపకశబ్దమునే శీర్షికయం దుంచితిని.

సాహిత్యములలో రూపక మున్నతస్థాన మాక్రమించు చున్నది. మన ప్రాచీన విమర్శక శిఖామణులు గ్రహించి, అమరాది నిఘంటువులు చెప్పినట్లు, కావ్యమునకు జనించిన సమ్మతే గాని నాటకముల జేసినట్లు కనబడదు. అందుచేతనే 'నాటకాంతం హి సాహిత్యమ్' అను సూక్తి వచ్చినది. ఆలోచనగాక వచించిరి కావ్యమును విచారించినచో శ్రవ్యకావ్య రచనము సాధన మొనర్చిన పిమ్మటనే దృశ్యకావ్య రచనకు బూనినట్లు తెలియుచున్నది. ఈ సిద్ధాంతానుసారమే 'నాటకాంతం కవిత్వ' మ్మను నార్యోక్తి. ఈవిధముగా సాహిత్యసృష్టియందును, సాహిత్యాస్వాదనములోను దృశ్యకావ్య మునకే ప్రశస్తి నొసగిరి. శ్రవ్యకావ్య రచనముకన్న దృశ్యకావ్య నిర్మాణము కష్టతర మని దీనివలన దెలియుచున్నది. రూపకము సమాహారకళ యగుటయే యిందలి రహస్యము.1 కవితారచనమందు కవికి శబ్దభావాధికారములే విశిష్టముగా వెలసియున్నవి. శ్రవ్య కావ్యమందు కథాచమత్కృతియు శబ్దమాధుర్యమును ప్రాధాన్యము వహించును కాని రూపకనిర్మాణము కవితా కళపై ననే కాక, సంగీతాభినయ రంగప్రసాధనములమీద నాధారపడియున్నది ఈయా కళలలో ప్రత్యేకముగా ప్రవేశము లేనిదే రూపకనిర్మాణము విజయవంతముగా కాదు. పైగా రూపకరచనములో కవి పాత్రలతో తాదాత్మ్యము పొందగలుగు మానసికశక్తి సంపాదింపవలసియుండును. ఇతి

1 Literature is an art dependent upon words, but the drama is a multiple art, using words, scenic effects, music, the gestures of the actors, and organizing talents of a producer. — B. IFOR EVANS.

వృత్తము సంఘర్షణములో గాని తత్పరిష్కారములో ముగియ వలెను 1 ఆఖ్యానములలో వలెగాక రూపకకావ్యము కథను కుదించుకొనవలసి యుండును. రూపకములో కథాకథనము సంభాషణము ద్వారా జరుగవలసి యున్నది గాన కథాగమన వేగము, కాలసంకోచము గాని సహజచిత్ర సంభాషణల నడుపుట యందు తను నిపుణుడై యుండవలెను; కథా, పాత్ర, రసాది శక్తుల చాలించు సామర్థ్య మలవఱచుకొనవలెను. నాటక ప్రయోజనమును జెప్పుచు భరతాచార్యుడు——

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం।
విశ్రాంతి జననం కాలే నాట్యమేత న్మయా కృతమ్॥
న తజ్జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా।
నాఽసౌ యోగో న తత్కర్మ యన్నాట్యేఽస్మిన్న దృశ్యతే॥

అని సూత్రించినాడు. ఇంతటి పరమప్రయోజనసాధనమున కధికారానుభవములు మిక్కుటముగా వలసియున్నవి. ఇన్ని పొసగినను దృశ్యకావ్యమునకు నిర్మాతల పదముగలిగినద్దై దృశ్య శ్రవ్య గౌరవములు రెండుటి సంధికపోయినచో లాభము లేదు. ఈ రెండు ప్రయోజనములలో నేది లోపించినను దాని సంపూర్ణత చెడినట్లె యెంచవలెను.2 ప్రేక్షకుల మెప్పువడయుటకు మంచి మనస్తత్వ మెఱిగియుండుట యత్యంతావశ్య

---

1 The essence of drama is crisis. A play is more or less a rapidly developing crisis in destiny or circumstance and a dramatic scene is a crisis within a crisis.

— William Archer.

2 చూ : పింగళి లక్ష్మీకాంతముగారిచ్చిన నాటకకళాపరిషదధ్యక్షోపన్యాసము

కము,1 ఆఖ్యానమునకును రూపకమునకు నున్న ముఖ్యభేద ములలో నిది యొకటి. ఇన్ని కట్టుదిట్టము లుండుటచేతనే రూపక[illegible]ము కష్టసాధ్యమైనది. కావుననే సాహిత్య ము[illegible]న కగ్రస్థానము లభించినది!

[illegible]ను కావ్యత్వసిద్ధిపొందిన రూపకముల రచించు[illegible] సంస్కృతమున కాళిదాసు, భ[illegible]తులు— ఆంగ్ల[illegible]రుగు, బెర్నార్డుషాలు జగత్ప్రసిద్ధులైనారు. [illegible] కవు లనువారు రూపకకారులే యనవలసి యు[illegible] యాం[illegible]సాహిత్య మీ [illegible]మున కప[illegible]న్నది. తెలుగుసాహిత్యములో రూపకము లు[illegible]ననే పొడసూపినవి. కవిత్వము చెప్పుటలో భిన్నభిన్న మార్గములు తొక్కుచువచ్చిరిగాని, మన వారు రూపకప్రక్రియనేలనో సాధింపరైరి. ఆంధ్ర సాహిత్యముపై సంస్కృత సాహిత్య ప్రభావము మొదటను, ఆంగ్ల సాహిత్య ప్రాబల్యము తరువాత నున్నట్లు గుర్తింతుము. ఈవిధముగా రెండు భాగముల జేకొని మన సాహిత్యమును పరిశీలించినచో నాంగ్ల సాహిత్య ప్రభావము సోకిన తరువాతనే యించుమించుగా రూపక రచనాప్రయత్నములు తెలుగునాట జరిగినట్లు స్పష్టమగును. సంస్కృత సాహిత్య

---

1 What appeals to the individual will not appeal to the multitude, and vice versa, so that a knowledge of the psychology of the multitude is a necessary part of the equipment of the dramatist. —E. W. Downs.

2 It is enough to remember that world's greatest poets are also its greatest dramatists. — Ashley Dukes.

ములో ననేక రూపకములున్నను మనవారి నా[illegible]కుం డుట కాయాకాలములం దాయా ప్రభువులే ప్రేక్ష[illegible] నియుండుటే హేతువగునని యూహింప[illegible] ఘు నకు సమకాలికులైన పిల్లలమఱ్ఱి పినవీరన శ[illegible] మును శ్రవ్యకావ్యముగా ననువదించుట [illegible] ఘుని శృంగార నైషధము యూపద్యమయ్యె [illegible] వలసి వచ్చును. లేనిచో దృశ్యకావ్యముగా [illegible] వేఱు హేతువు కానరాదు. ఆయా యుగధర్మ[illegible] యభిరుచుల ననుసరింపకపోయినచో తదాశ్రితు[illegible] జీవితములు తెల్లవారుట యెట్లు? ప్రాచీన ధ[illegible] ములో నున్న గ్రంథము లన్నియు ప్రభువుల ప్రోత్సాహముచే రచింపబడినవిగాని ప్రజా బాహుళ్యము బహూకరించి వ్రాయించినవి కావు. అందులకే యాసాహిత్యమంతయు నాగా తన్మై యేకసూత్రానుసారి (Typical) గా నున్నది.

పామరుల యభిరుచులను, వ్యవహారములను దెలిసి కొని వారి కానందముగూర్చు రచనల జేసిన కవులకు సాహిత్యములో సముచితస్థానము లేకవచ్చినది. కావుననే యట్టి వారి రచన లనేకములు కాలగతిలోపడి మృగ్యమైనవి. రూపక మనగనే పండిత పామరులను మెప్పించునదై యుండవలెను. రాజాస్థానములం దాసనముల వాంఛించు కవుల కీదృష్టి యుండుట సాధ్యముకాదు. అయినను పామర జనానందము గూర్చు దేశికవిత మన యాంధ్రమందు పొడసూపుచునే వచ్చినది. పదకవిత్వమంతయు నట్టిదిగా పూర్వము గమనించి నాము. దేశీయ వృత్తములలో నాదవ్యక్తిగల సులభపద

సంఘములోని వర్గలను దర్శకులై పామరుల ప్రబోధించి సంస్కరించుటకే యుద్దేశింపబడినది.

అట్టి దేశికవితలో రూపక ప్రక్రియకూడ సంకురార్పణ నొందిన ట్లూహింప వీలున్నది.1 మన దేశములో ప్రచారమందున్న తోలుబొమ్మలాటలు ప్రదర్శనమునకు ప్రాతిపదికలేమో యని యనుమానింప నగును.2 ఈ దేశిసరణికి చెందిన నాటకమే 'యక్షగాన'మను పేరుతో వ్యవహరింపబడినట్లు కనుగొందుము. యక్షగాన మనునది సంస్కృత పదమైనను సంస్కృతమున నిట్టిదిగానరాదు, పండితులీ ప్రక్రియనే పెద్ద పేరుతో బిలువదలచి 'జక్కులపాట' యనుదానికి సంస్కృతీకరించి యుందురు. జక్కులవారు వృత్తి సంఘములలో నొక తెగకు చెందినవారు. వారి విశిష్టమైన గానమును స్మరించుచుండుటచే నది 'జక్కులపాట' యైనది. వారే దేశిరూపకముల బాడుచు నభినయించెడివారు కాబోలు!

ఈయక్షగానములు శ్రీనాథుని కాలమునాటికేయున్నట్లు తెలియుటకు తత్ప్రణీత భీమేశ్వర పురాణమందుగన్పించుచున్నది 3 క్రీడాభిరామమును వీధినాటకమని యనుచున్నారేగాని, తల్లక్షణము లెవ్వియు దాని కన్వయింపకుండుట.4

---

1. గ్రీకు నాటకము కూడ నాగరకులైన పల్లీయుల వినోదార్థమంకురించి నట్లు తెలియుచున్నది.

2 The simple puppet- show is everywhere the most recent form of dramatic representation and it was in India. — Pihael

3. కీర్తింతురెద్దానికీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరణి.
భీ. ఖం. 3. 63.

4. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి దశరూపక టీక.

చేసది మన కేవిధముగాను దొరకుటకు పెన్నన కాలమునకు నాటకశాల లున్నట్లు తెలియవచ్చుచున్నది గాని యితరము లైన యాధారములు లేకున్నవి. తుదకు నాయకరాజుల కాల ములో గీతికి ప్రాధాన్యము వచ్చినదిగాన యక్షగానములను నవి కుప్పతిప్పలుగా నాటి కవులు వ్రాసినారు. ఈ యక్షగాన ముల స్వరూపము విచిత్రమైనది. కథను బోధించు కీర్తనల గకొని వానికి మధ్య మధ్య నటులు తమ వచనములను గలు పునట్లు నిర్మితములైనవి కొన్ని యున్నవి; కీర్తనలతో బాటు దేశీయ గేయనృత్తములు జేరి కొన్ని యున్నవి. తరువాత వచ్చిన కవితాప్రౌఢిమచేతను, తదితరాంగ శోభచేతను యక్ష గానములు ప్రత్యేకత గడించినవిగా తెలియుచున్నది. ఆనాడు ప్రోత్సాహమందిన నటకులలో ప్రధానముగా పల్లీయు లేయుండి రనుటకు మొన్న మొన్నటివఱకు ప్రచారములోనున్న వీధి భాగవతులే నిదర్శనము. కావుననే ఏనాదివా రభినయించు దానిని 'ఏనాది భాగవత'మనియు, కూచిపూడివా రాడుదానిని 'కూచిపూడి భాగవత'మనియు ప్రజలు వ్యవహరించుచు వచ్చినారు. ఇప్పటికిని వీని స్వరూపము సచ్చటచ్చట గాన గల్గుదుము. కూచిపూడివారి భామకలాపము గొల్లవేషములు సుప్రసిద్ధములు! వానినుద్ధరించి యభినయకళనునిల్పుకొనవలసిన కర్తవ్య మీనాడు మనపై నున్నది. ఇట్లు పదునేడవ శతాబ్ది మొదలు పందొమ్మిదవ శతాబ్దివఱకు యక్షగాన రచన సాగు చునేవచ్చినది. ఈయక్షగానము లెక్కుడమ్ముద్రితములుగా తంజాపుర పుస్తక భాండాగారముననే నిలిచియుండుటచే నివి

[illegible] న్నవి. అంత [illegible] సమయోచితగాన సంగీత కథనముగా నారి 'హరికథా' రూపమును ధరించినది. బహుపాత్రాభినయమునకు యక్షగానముల వలె తావు లేక హరికథ ఏకపాత్రాభినయమున కవకాశ మిచ్చునదై వరలి నది. ఈ హరికథ మనజాతి కున్న విశిష్ట ప్రక్రియగా నెన్న బడెను.

ఇట్లు స్థూలముగా దాదాపు గత శతాబ్దాంతము వరకు నాంధ్రమున దేశి నాటకములు కన్పించుచున్నవిగాని మార్గ నాటకములు లేకున్నవి. ఆంగ్ల సాహిత్య ప్రభావము క్రమ ముగా మనలను లోగొనినది. ఉత్తర దేశమునుండి గత శతా బ్దపు మధ్యకాలములో నాటక కంపెనీలు వచ్చి మన యాంధ్ర ప్రాంతమున ప్రదర్శనముల నిచ్చుటచే మనవారిలో నొంత కదలిక బయలు దేరినది. ఇవి కారణములుగా రూపక రచనా ప్రయత్నములు విరివిగా సాగినవి. రాజమహేంద్రవరములో గుంటూరులో, బళ్ళారిలో, విజయనగరములో, నెల్లూరులో కంపెనీలు వెలసినవి. వారు ప్రదర్శించుట కొఱకు కవులు నాటకముల రచించుటకు బూనినారు; తొలిదినములలో సంస్కృతాంగ్ల నాటకముల ననువదించుటతో ప్రారంభమై నది. వావిలాల వాసుదేవశాస్త్రిగారు షేక్స్పియరు వ్రాసిన 'సీజరు'ను, భవభూతి వ్రాసిన 'ఉత్తర రామచరితము'ను తెనుగున కనువదించినారు; అట్లే వీరేశలింగముపంతులు 'వెన్నిసు నగరవర్తకుడు', 'అభిజ్ఞాన శాకుంతలము' 'మాళవి కాగ్నిమిత్రము', 'ప్రబోధ చంద్రోదయము'ల ననువదించి

నారు. వేదము వేంకటరాయశాస్త్రిగారు 'ఉత్తరరామచరిత' 'శాకుంతలము' 'రత్నావళి', 'నాగానందము' ల ననువదించిరి. తిరుపతి వేంకటకవులు ముద్రారాక్షస మృచ్ఛకటికల ననువదించినారు; వడ్డాది సుబ్బరాయకవి వేణీసంహారము రచించినారు. ఈవిధముగా నెందరెందరో సంస్కృత నాటకముల ననువదించినారు; అనువదించుచున్నారు; ఆంగ్ల నాటకానుకరణ మంతవిరివిగా జరుగలేదు. దీనికి కారణము సంప్రదాయభిన్నతయే కావచ్చును.

తరువాత ననువాదములకన్న స్వతంత్ర నాటకముల రచింపవలెననెడి కుతూహలము పొడమినది. తత్ఫలముగా పురాణగాథలను, చారిత్రకాంశములను తీసికొని నాటకరచన సాగుచువచ్చినది. ధర్మవరము కృష్ణమాచార్యులవారి సారంగధర, చిత్రనళీయము, ప్రహ్లాద, ప్రమీలార్జునీయము, చంద్రహాస మొదలైనవి; కోలాచలము శ్రీనివాసరావుగారి తళ్లికోట యుద్ధము; బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి హరిశ్చంద్ర; శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బొబ్బిలి; తిరుపతి వేంకటకవుల ఉద్యోగ విజయములు; వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయము; పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి రాధాకృష్ణ, విప్రనారాయణలు; చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి గయోపాఖ్యానము, పారిజాతాపహరణము. మొదలైనవి పై శ్రేణికి చెందిన ప్రయోగార్హతను బొందిన ప్రసిద్ధ స్వతంత్ర నాటకములు. తరువాత సాంఘికసమస్యల నెదుర్కొనెడి నాటకముల వ్రాయ సంకల్పించిన వారిలో గుర

వాడే అప్పారావుగారు కన్యాశుల్కము వ్రాసి స్థిరకీర్తి వడసినారు. వీరేగాక, శ్రీయుతులు బళ్ళారి రాఘవాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, గుళ్ళపల్లి నారాయణమూర్తి, ముద్దూరి శ్రీరామమూర్తి, కోపపరపు సుబ్బారావు, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, దామరాజు పుండరీకాక్షుడుమున్నగువారెందరెందరో పలువిధములైన వస్తువులతో, శైలులతో నాటకములు రచించినారు. [1]

కాని, నాటక నిర్మాణమునకు గావలసిన వివిధ శక్తులలో సంపూర్ణముగా నన్నిశక్తులుండి రచింపబడిన నాటకమూర్తి నేటికి నవతరింపలేదని చెప్పవలెను. రమణీయమైన కవితయుండి, చతురమైన సంభాషణములుండి, నిబిడమైన కథాసన్నివేశము నేసుకొని, చక్కని పాత్రోన్మీలనము చేసి, కావ్యత్వము నొందగలిగి, ప్రయోగగౌరవము బడసెడినాటకమవతరింపవలసియేయున్నది! నేడుపలభ్యమానములగు నాటకములలో గొన్ని లక్షణము లన్వయించునవే యున్నవి. కాకపోయిన సర్వాంగ పరిపూర్ణమగు రూపకములేని కొఱతయుండనే యున్నది. అసలు సృష్టిలోనే పరిపూర్ణత లేదు గనుక మనము విచారింపరాదేమో!

ఆంగ్లసాహిత్యపు సంపర్కమువలన మన నాటక నిర్మాణములో గొన్ని సంప్రదాయములు తొలగిపోయినవి.

1. శ్రీ వావిలాల సోమయాజులు రచించిన నాయకురాలు, శ్రీ పింగళి నాగేంద్రరావు రచించిన 'వింధ్యరాణి' యను నాటకము లీనాడు ప్రశంసల నందుచున్నవి.

దశరూపకములోని లక్షణముల కేనాడో మనము దూరుల మైనాము. స్వాతంత్ర్యము ప్రబలిన కొలది సంగీతము హెచ్చుచున్నది; దశాంకములు, పంచాంకములు క్రమముగా క్షీణింపజొచ్చినవి. 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని' అను సంప్రదాయము ప్రాతవడి యాంగ్లమండలి 'ట్రాజడీ' (కరుణము) పై ప్రభావమేర్పడినది. అరిస్టాటిలు ప్రతిపాదించిన ఐక్యత్రయ సూత్రము (Three Unities) నెఱిగి. యీప్రకారము సాధనమును సాగించుచు వచ్చినారు. రంగస్థల నిర్మాణములోగూడ పాశ్చాత్యులే మనలను దిద్దుచున్నారు. వారి గురుత్వము సంపూర్ణముగా నేటి మనరూపకములమీద నున్నట్లు తెలియగలము. ఇకనైన ప్రాచీనలాక్షణికు లేర్పఱచిన సూత్రముల ననుసరించి భారతదేశపు ప్రత్యేకత చాటుటకు పూనుకొని భరతశాస్త్రమందలి రంగస్థలమును తెలిసి తదనుగుణములైన నాటకముల రచించుటకు మనవారు శ్రద్ధ వహింపవలసియున్నది. దేశినాటకములైన యక్షగాన వీధిభాగవతముల నాదరించుచు మార్గనాట్యనిర్మాణమునకై పరిశ్రమ జేయవలసియున్నది. అట్లు చేసినచో సాహిత్యములో నుత్తమ ప్రక్రియను సాధించి తల్లోపమును తొలగించినవా రగుదురు.

# రూపకవికాసము

## ౧

మానవులు నిత్య నవ్యతాన్వేషణులు. ఈ ధర్మము కవులకును వర్తించును. సాహిత్యములో నే యుగమున కా యుగము నూతనముగా కన్పించును. ఒక్కొక్క యుగములో నొక్కొక్క ప్రత్యేకత, విశిష్టత గడించినది సాహిత్యము. రాను రాను నేటికి నవ్యయుగము వచ్చినది.

ఈ యుగములో వచ్చిన నవ్యసాహిత్యములో మూడు విశిష్టరూపము లున్నవి. అవి ఖండకావ్య, కథానికా, ఏకాంకికలు. లోతుగా పరిశీలించిన నీమూడును మనకు క్రొత్తవి కావనినట్లును, పూర్వము మనకున్న కావ్యభేదముల కివి ప్రాతిపదికలనునట్లు గోచరించును. ఎట్లనగా-ప్రబంధమునకు ఖండకావ్యము, నవలకు కథానిక, నాటకమున కేకాంకిక సూక్ష్మ రూపములు.

ప్రబంధము-నవల-నాటకము- ఈ మూడును విస్తృతమైన వస్తువుకల్గి. వీని లో ప్రాసంగికములు, ఉదాహరణములు చిత్రకథలు, అధికవర్ణనములు మొదలైనవి యెన్నియో యిమిడి వస్తువిస్తృతికి దోహదము చేయును. కాని, నవ్యయుగములో వచ్చిన ఖండకావ్యము, కథానిక, ఏకాంకిక లట్లుకావు.

వీనిలో వస్తువు సూక్ష్మమైనది. రచనమే చాల ప్రధానమైనది. ఈ రచనములో నుద్వేగము, ఔజ్జ్వల్యము కలిగి, ప్రధానవిషయమును సూటిగా, సరళముగా, సులభముగా బోధించుశక్తి యుండవలెను. వీనిలో నుండునదియొక్క సన్నివేశమే. ఆ ఒక్క సన్నివేశమురచనా ప్రభావమువలన హృదయమును చప్పున నాకర్షించి, రసానుభూతిని పొందజేయవలెను. నవ్యయుగములో వచ్చిన యీ మూఁడురూపములు స్వల్పకాలపరిమితులు. అత్యల్ప వస్తువులో ననంతమగు రససిద్ధిని పొందింపవలెను. సూక్ష్మములో మోక్షము పొందించుట వీనిసూత్రము; నవ్యులయత్నమును.

పూర్వము మనకీ విధమైన సాహిత్యమున్నదా యను ప్రశ్న కున్నదనియే సమాధానము. కాని యీ యుగములో తిరిగినన్ని మలుపులును, వచ్చినన్ని మెరుగులు నపుడు లేవనియే యొప్పుకొనవలెను. మనపూర్వ ప్రబంధములలో నున్న వర్ణనలన్నియు ప్రత్యేకముగా గ్రహించిన ఖండకావ్యములుగను, పురాణములలోనున్న ప్రాసంగికములన్నియు కథానికలుగను, రూపకభేదములలో ధనంజయాదులు లక్షీకరించిన వీథి, అంకము, భాణము, ప్రహసనముల నేకాంకికలుగను పరిగణింపవచ్చును. ఇవి యీ విధముగా మనకు విజాతీయములుగాక, సజాతీయములే యున్నట్లు తెలియుచున్నది. ఇప్పుడున్న స్వయం సంపూర్ణత, కళావిషయకైక్యతలు పూర్వము లేవు. అనగా, నాయాకావ్యములలో నవి యంగములుగ నున్నవి కాని, ప్రత్యేక కళాసిద్ధి పొంద

గలుగు 'అంగి'గా నిలువ లేకపోయినదని స్పష్టముగా దెలియును. ఆయాఘట్టములనే నవ్యులు గ్రహించి చిత్రించినపుడు పూర్వసాహిత్యములో లెక్కకుమీరి యిట్టి సన్నివేశములున్నవని ద్యోతకమగును. కనుక పాశ్చాత్య ఏకాంకికా లక్షణములను వీనికి ననువర్తింపజేయవలసివచ్చును. ఇప్పుడు నవ్యసాహిత్యోద్యానమున వికసించిన మూడుపుష్పములు పాశ్చాత్యాలంబన పురస్కృతములు.

ముందు మనవిచేసినట్లు ఏకాంకనాటికలో నొక్క సన్నివేశమే యుండవలెను. నాటకకారు డన్ని యంకములలో తీసికొని రాగలుగు విభావానుభావ సాత్త్విక వ్యభిచారీ భావ సంయోగమును, ఏకాంకనాటకకారు డొక్క యంకములోనే తీసికొని రావలయును. ఉదాహరణమునకు చిన్నపిల్లలు చిన్న చిన్న తాటియాకుబొమ్మలలో జీవితములోని ఘట్టములను సూచించుచు నాడుకొందురు. అనగా వారు మానవజీవిత మంతటికిని సూక్ష్మాకార మిచ్చుచున్నారన్నమాట. అట్లే ఏకాంకిక మహా నాటకమునకు సూక్ష్మరూపమైనను, వస్తువిస్తృతి లేక ఉన్న ఒక్క ఘట్టము భావపూరితముగాను, హృదయమును కదలించి కరగించునదిగా నుండవలెను. పాత్రౌచితి, సంభాషణాచాతురి, కథాకథనపద్ధతి, పౌర్వాపర్యముల సమత, వస్తువుయొక్క బీజగర్భనిర్వహణములు మొదలైనవి యన్నియు మహా నాటకకారునివలెనే ఏకాంకికా కారుడు ననుసరింపవలెను. ప్రయోగ, పఠనయోగ్యత లను రెండు ధర్మము లేకాంకి

కథను వర్తించును. కాని ప్రదర్శనము పైపునకే యెక్కువ మొగ్గు నేకాంకిక ఆ ప్రదర్శనములో అనకొనని కొత్త మనఃపులతో వస్తువు ముగిసి సామాజికులను భయ సంభ్ర మాశ్చర్యములలో ముంచివేయవలెను.

ఏకాంకికా నిర్మాణమంతయు కథానికా నిర్మాణ మును పోలియుండును. కాకపోయిన నాకథనే నాటకీయము చేయుట యుచట ధర్మము. అందుచేతనే "In dramatic composition, the equivalant of the Short-story is the One-act play" అనినాడు. బ్రాండరు మాథ్యూస్. ఏకాంకిక నక్కగా రచింపగల సమర్థుడు మహానాటక నిర్మాణమున కర్తుడు కాగల డనుటలో సందేహము లేదు. నిజమున కుత్తమ ఏకాంక నాటకమే సామాజికులు మహానాటక ప్రదర్శనము నానందించునట్లు తర్ఫీతిచ్చునని మారియెట్ అన్నాడు.

స్టీవెన్సన్ కథానికను గురించి చెప్పిన సూత్రము ఏకాంకికకును వర్తించునని చెప్పవచ్చును.

1 పాత్రములనుబట్టి, వాతావరణమును, సందేశ మును చిత్రించుట.

2 సందేశమును బోధించు నిమిత్తము, పాత్రములను వాతావరణమును సృష్టించుట.

3 వాతావరణమును చూచి పాత్రములను, సందేశ ములను కల్పించుట.

ఏకాంకిక నాటకము ముఖ్యముగా సంభాషణమీద నాధారపడి యుండును గనుక సంభాషణములు, సూటిగా, చిత్రముగా, వ్యంగ్యముగా. పదునైనవిగనుండి పాత్ర చిత్రణములోను, కథావేగములోను దోహదము చేయవలయును. భాషా విషయములో పాత్రోచిత భాష తప్పక ఉపయోగింపవలెను. దీనికి ననుభవము చాల నవసరము. నాటిక యంతయు నొక సందేశము నందించుచు ప్రతియంశము నా ధర్మోన్ముఖమై యుండవలెను.

ఏకాంకికా స్వరూపమునుగురించి చెప్పిన దాని సారాంశమును సూత్రప్రాయముగా చెప్పవలెననినచో నిట్లుండును:-

1. భావనైశిత్యము 2. ఏకాగ్రత 3. సమగ్రత 4. ఏకైక సన్నివేశము 5. పరిమితపాత్రసంఖ్య 6. అర్థబంధురత 7. పాత్రోన్మీలనము 8. సరససంభాషణములు 9. రచనాసౌలభ్యము 10. ఐక్యత్రయసత్త్వము 11. సందేశదాయకత్వము 12. ప్రయోగగౌరవము—ఇవి యన్నియు నుండవలెను. ఇన్ని యుండియు వస్తువు సార్వజనీనమైనది కాకపోయినచో, అది ఎంతయో కాలము నిలువను నిలువదు; ఉద్దిష్ట రసానుభూతిని కలిగింపను కలిగింపదు. కాబట్టి విశ్వజనీనముగా నుండుట కావ్యధర్మము.

ఇక తెలుగులో నేకాంకికా రచయితలను, వారి రచనలను పరికింతము. ఖండకావ్య కథానికలు పెరిగిపోయినవి. ఏకాంకికారచన యిటీవలనే బయలుదేరి సాగుచున్నట్లు కన

బడుచున్నది. లెక్కకు చాల కన్పించినను, పరిణతి కాగునవి చాల తక్కువ. ఒక్క విషయము చెప్పవలెను. ఖండకావ్యములలో మనవారు సిద్ధహస్తులైనారు. కథానికలలో యత్నించుచున్నారు. ఏకాంకికలలో ప్రాథమికావస్థలో నున్నారు.

ఏకాంకికా సాధకులలో—నోరి, తల్లావఝ్ఝల పితృపుత్రులు, చింతా, చిలుకూరి, అబ్బూరి, విశ్వనాథకవిరాజు, మల్లాది అవధాని, రామకృష్ణశాస్త్రి శర్మలు, శ్రీపాద, ముక్కపాటి, భమిడిపాటి, ఇంద్రగంటి, ముద్దుకృష్ణ, చలం, విశ్వనాథ, గిరి, రజనీ, జానకిరాం, సాధనసమితి సభ్యులు కొందరు మొదలైనవారున్నారు.

వీరి రచనల నన్నిటిని పరిశీలించినచో, ఏకాంకికలు నాలుగు విభాగములుగా కన్పించుచున్నవి. 1. వచననాటిక 2. గేయనాటిక 3. పద్యనాటిక 4. రేడియోనాటిక. ధార్మిక, సాంఘికములనెడి యంతర్విభాగ మున్నది. ఆయా పథానుసరణము ననుసరించిన విభాగము కన్పించును. వీనిలో వచన మొకటియే ఉత్తమమనుటనంగీకరించవలెను. గేయము హృదయద్రావక గుణము కలిగినది. కాబట్టి గేయనాటిక రసానుభూతిని సత్వరముగా సమకూర్చునని చెప్పవలెను. 'రజని' గేయనాటిక యెన్నదగినది. పద్యనాటికల విషయములో 'సభాపతి' సిద్ధహస్తుడు. రేడియో ఏకాంకికకు చక్కని యాలంబన మిచ్చుచున్నది.

పైన చెప్పిన రచయితల ఏకాంకికలు నే నుల్లేఖించిన సూత్రము లన్నిటి నొప్పించునవికావు. కాకపోయిన నొక్క

క్కరి రచనములో కొన్నిసూత్రములుమాత్రమే కన్పించును. ఉదాహరణమునకు: శ్రీపాద సంభాషణాచాతుర్యములో, చిలుకూరి నాటకమునకు మైన వస్తువు నేర్పుకొనుటలో, ముక్కుపాటి యేకాగ్రతలో ప్రతిభ చూపినారు. అట్లే ఒక్కొక్కరు కొన్ని లక్షణములు ప్రస్ఫుటముగా వ్రాసినారు. కాని, సర్వాంగ సుందరముగా అన్నిలక్షణములనొప్పించు ఏకాంక నాటిక ఇంకను తెలుగులో రాలేదనియే చెప్పవలెను. నోరి వారి 'ఖేమాభిక్షుని' అను నాటికమాత్రము చాలవరకన్ని లక్షణములు కలిగి ధర్మనాటికకు సమీపములో నున్నదని చెప్పవచ్చును. సర్వలక్షణ సమన్వితమైన నాటిక తెలుగులో నిర్మించుటకు నవ్యులు ప్రయత్నింతురని యాశయము.

---

ఈనాడు ఏకాంకికా రచయితలు లెక్కకు మించిపోయినారు. రేడియో నాటికలను శ్రీయుతులు కపిల కాశీపతి, వేమూరి వేంకటరామనాథము, పన్యాల రంగనాథరావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, బుచ్చిబాబు మున్నగువారు సాధించుచున్నారు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, మారేమండ రామారావుగారు చారిత్రకాంశములతో నేకాంకికలు రచించుచున్నారు. ఇంక ఎందరో యత్నించుచున్నారు. నాటికారచనకు భవిష్యత్తున్నట్లు తోచుచున్నది.

8 జూన్ 1948 తేదీన హైదరాబాదు రేడియో నుండి ప్రసారితము.
హైదరాబాదు సమాచారములో, (ప్రజామిత్రలో ప్రకటితము)

— హి. శర్మ

# సాహిత్యపరిణామము

## ౧

ఓమ్

సహనావవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తు
మా విద్విషావహై.

### ఆంధ్రసాహిత్యార్చకులకు నమోవాకములు

### —కృతజ్ఞత—

మీ రీనాడు నాకు చేసిన యీ గౌరవమునకు కృతజ్ఞుడను. ఈయధ్యక్ష స్థాన మలంకరింపదగిన యోగ్యతాధికారములు నాకు లేవు. వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులనేకులుండగా దీనికి తగుదునని, నేనంగీకరించుట సాహసకార్యమే. నాబోటి కించిజ్జ్ఞుని నీసమావేశమున కధ్యక్షత వహింప నాజ్ఞచేసి మీ రేమి సాధింప దలచినది నేనూహింపలేను. అకారణముగా పక్షపాత మలవడినచో ప్రతిక్రియ లేదని పెద్దలందరు. శారదాదేవి యాశీర్బలముతో, సహృదయులైన సభాసదుల సానుభూతితో నాకర్తవ్యమును శక్తివంచనలేక కొన సాగింతునని మనవిచేయుచున్నాను.

### —అంజలి—

ఆంధ్రులు విలక్షణమైన గుణములను కలిగిన ప్రత్యేక జాతికి చెందిన వారు. విజ్ఞానమున కాంధ్రదేశ మొకప్పుడు నెలవై చెన్నొందినది. ప్రాచీన

రైన నాగులకును ఆంధ్రులకును సంబంధమున్నట్లు వారి యాచార వ్యవహారములనుబట్టి యూహింప వీలున్నది. తచ్చిహ్నముగా నాదిశేషు వుపాస్యదైవముగా నిల్పినారు. కావుననే కాబోలు నిప్పటికిని కొన్ని జనపదములలో నాగారుగొమ్మ గ్రామదేవతగా నారాధింపబడుచున్నది. మీదు మిక్కిలి శేషువు విజ్ఞానమున కుపలక్షకుడు. ఆంధ్రులకును, ఆదిశేషువునకు నింతటి చక్కని సంబంధము పొసగుటచే నీసందర్భమున వానిని సంస్తుతించు నొక జాతిసంప్రదాయము ననుసరించినట్లగును. ఆదికవియైన నన్నయభట్టాచార్యుని వాక్యసరణి మన కనుశాసనముగావున నాతని పద్యములలోని పల్కెదను :—

బహుజనపాదపాద్రికులపర్వతపూర్ణసర స్సరస్వతీ
సహితమహామహీధర మజస్ర సహస్రఫణాళి దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి పాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకు ప్రసన్నుఁ డయ్యెడున్.

ప్రవేశిక. భా. ఆది. ౧—౧౦౪

ఆంధ్రులది పాలకజాతి. క్రీ. పూ. 234 నుండి క్రీ.శ. 207 వరకు నాంధ్రరాజులు దేశమును పాలించినారు. శాతవాహను లాంధ్రులని చారిత్రకుల సిద్ధాంతము. ఈయాంధ్రరాజుల పోషణమున వైదిక, జైన మతములు వర్ధిలినవి. కాని వైదిక మతమునే వా రనుసరించుచు వచ్చినట్లు వారు చేసిన యశ్వమేధాది యాగములే ధృవపఱుచుచున్నవి. నాటి సంఘము వర్ణాశ్రమ ధర్మములకు బద్ధమై యొప్పారినది; కావున నే విధమైన సంఘర్షణములు లేకపోయినవి. ఆనాటి ప్రజలు శాంతియుతమైన జీవితమును గడపినారు. శ్రద్ధాభక్తులు, మాటమర్యాదలు, ధైర్యసాహసములు, వినయ విభూతులు వారి మనసులలో సంపూర్ణావకాశము పొందినవి.

సంస్కృత భాషాసాహిత్యములే నాటి పండితుల యాదరము నందినవి. వాని సంప్రదాయ సూత్రాదులే యదస్[illegible]లముగా భావితములైనవి. తరువాత హాలుడు ప్రాకృ[illegible]దును, గుణాఢ్యుడు పైశాచియందును గ్రంథములను రచించి రాబోవు తెనుగు సాహిత్యమునకు మార్గదర్శకులైనారు. నాటికి ఆంధ్రభాష రాజస్థాన ప్రవేశమున కవిత గడింపలేదు. దైనందిన వ్యవహారములో నుండి జనబాహుళ్యము నాశ్రయించినదే కాని రాచరికమును, ఉత్తమ సాహిత్యము నాధారముగా జేసికొనలేదు; పసితనములో నుండి యున్న[illegible] మధురనాదములీను జలిబిలి పలుకులతో ప్రజలహృదయముల నార్ద్రీభూతము లొనర్చుచుండినది.

### సాహిత్యమునకు మతమే ప్రోద్బలము

క్రీ. వె. ఏడవ శతాబ్దికి— అనగా చాళుక్యరాజుల పరిపాలనా కాలములో ఆంధ్రభాషకు క్రమముగా గౌరవము లభించినదని తెలియుటకు వారి శాసనములే నిదర్శనములు. నాటికి బౌద్ధమత ప్రచార మద్ధతమైనది. బౌద్ధవాఙ్మయము ప్రాకృతమున విరివిగా పెరిగిపోఁజొచ్చినది. వైదిక మతసంప్రదాయముల నిలువఁద్రొక్కవలసిన కర్తవ్యము హెచ్చినది. సంఘజీవనము దేశకాల పరిస్థితుల ననుసరించి మార్పుచెందుచుండును. దీని ననుసరించియే యాయా జాతి సాహిత్యములు వర్ధిల్లుచుండును. పూర్వసాహిత్యములో సంఘజీవితము ప్రతిబింబించుట లేదని యిటీవల కొందఱభి ప్రాయపడుచున్నారు. కాని యది సరిగాదు. పదునొకండవ

శతాబ్దములో చాళుక్యనృపాలుడైన రాజరాజు వైదిక మత ప్రచారార్థము దీక్షబూనినాడు; ఆంధ్ర వాగనుశాసనుడైన నన్నయభట్టారకుని పవిత్రవచస్సులో నాంధ్రభారతావతరణము పొసగినది. మహాత్ముడైన నన్నయ స్వస్థాన వేష భాషాభిమతులును, రస ప్రలుబ్ధమయిన మనస్సుగలవారయి పెద్దలు దేశభాషా కావ్యముల గౌరవింపవలెనని ప్రబోధించినారు. ఈవిధముగా నాంధ్రదేశ భాషాసాహిత్యములపై నాదరాభిమానము లుద్బుద్ధములైనవి.

### దేశికవిత—తత్ప్రభావము.

ఇంతలో వీరశైవమతము విజృంభించినది. తత్ప్రచారము నిమిత్తము వాఙ్మయ మాశ్రయమై వృద్ధికాజొచ్చినది. ప్రజల కందుబాటులో భాషాభావము లుండవలెననెడి యభిప్రాయము బౌద్ధకాలమునాటికే ఉదయించి యీకాలమున నభివృద్ధి నొందినది. సులభబోధకై 'దేశికవిత-జానుతెనుగు' లత్యంతోపస్కారములుగా కనిపెట్టినారు. శబ్దకాఠిన్యము లేక సరసమగు పదములతో కూడి, రాగరంజితమై, ప్రజల ఆచార వ్యవహారములకు ప్రతిబింబమై, జాతీయముల నిమిడ్చికొనినదై పామరుల కష్టములను మరపించి కార్యసాధనములో నుత్సాహమును ప్రసాదించునట్టిదైన పదకవిత్వమునకు బీజ మానాడే నాటబడినది. ప్రజాదరమే కవితకు లక్ష్యమనీ, ప్రజల సంస్కరించుటే కవితాధర్మమనీ ఆనాడే గుర్తింపబడినవి. ఏరాజుల కనుసన్నలకును ఆనాటి పదకవిత బద్ధము

కాలేదు. అట్లు కానిచో నాకవితలో నంతటి యుద్రుతము, స్వేచ్ఛాస్వేచ్ఛత లుండుట కవకాశము లెక్కడివి ?

ఈ 'దేశికవితోద్యమ' ప్రభావము తరువాత వచ్చిన తిక్కన కవితలో గన్పించుచున్నది. తెలుగు నుడికారమును మూటకట్టుకొనిన యాతని జాతీయ రచనమే యిందులకు తార్కాణము. పిమ్మట వచ్చిన ద్విపద రామాయణ హరిశ్చంద్ర నలోపాఖ్యానములుకూడ నీ 'దేశి'మార్గమునకు చెందినవే. శ్రీనాథునికూడ నీసిద్ధాంతము లోబరచుకొని యాతనిచే పల్నాటి వీరచరిత్రను వ్రాయించినది. ఇవి తోలుబొమ్మలాటలద్వారా, వృత్తి సంఘములుగా వరలిన జంగముల ముఖమునను ప్రచారమందినవి. ప్రజల కాహ్లాదము గూర్చుచు పౌరాణిక గాథలను బోధించుచుండుట కీ ద్విపదలు తోడ్పడుచువచ్చినవి.

### కావ్యములు ప్రభుసమ్మితములు

పిమ్మట చాలకాలమువరకు మన సాహిత్యము ప్రభుసమ్మితమైనది. కవులు సంస్కృత కావ్యానువాదములతో కాలము గడపుచువచ్చినారు. కావ్యములు పాండితీ ప్రకర్ష కాలవాలమైనవి. ప్రజల హితముపైగాక ప్రభు వోసంగు కానుకలపై కవులదృష్టిపడినది. ప్రభువులు సహజ సౌందర్య విలసితములగు వనములలో విహరించుటమాని కృత్రిమోద్యానవిహారములకు మురిసిపోవుట పరిపాటయినది. ఈసూత్రమే కవులనుగూడ పరిపాలించినది. ఆద్యసత్కథల గైకొని చిత్రించుట—కల్పనా కథలచే మురిపించుటలు జరిగినవి. రాజాశ్రి

యము లభించిన కవులకు ప్రజలతో నిమిత్తమేమి? వారి కష్ట నిష్ఠురములు కావ్యవస్తువులగుట కవకాశ మెక్కడిది?

క్రమముగా కవులు ప్రభువులకు మిత్రులై పొట్టలో చల్ల కదలక వర్తిలినారు. వాతావరణాను గుణముగా ప్రణయ చింతనము హెచ్చినది. రాజాంతఃపురములు కవులకు సుపరిచితములగుటచే నచటి వస్తువులు, సన్నివేశములు వారి కావ్యములలో ప్రతిబింబితము లగుచువచ్చినవి.

'నిరుపహతి స్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె, మాత్మకింపయిన భోజన, మూయ్యెలమంచ, మొప్పు తప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్'

దొరకడివాలు వారికి. తినమరగినవాడు పస్తుండ గలడా మరి? అంతటి సౌఖ్యముల నందినారు గనుకనే నాడు వారి ప్రాపు సడలినంతనే శ్రీనాథ పెద్దనలు 'జీవచ్ఛవముల' విధముగా నున్నట్లు వ్రాసికొని విలపించినారు.

## సంపూర్ణ భాషాభావ కల్పనా సౌష్ఠవము

శ్రీకృష్ణరాయల కాలము తెనుగుజాతి వైభవమునకు సర్వవిధముల శిఖరప్రాయము. సాహిత్యమునకు భాషాభావ కల్పనాసౌష్ఠవము నానాటికవులు సంపూర్ణముగా నిచ్చినారు. తెలుగు సాహిత్యక్షేత్రములో విశిష్టమైన ప్రబంధవృక్షము శాఖోపశాఖలై విరాజిలి రసవత్ఫలముల నీనిన దీ కాలమందే.

## సాహిత్య సౌధపతనము

కృష్ణరాయల యనంతర మల్పకాలముననే విజయనగర సామ్రాజ్యము క్షీణించినది. కవు లించుకుంచుగా పొట్టలు

పుచ్చుకొని బయలు దేరవలసివచ్చినది. చిన్నచిన్న సామంతులు రాజులైనారు. వారికి తాము చక్రవర్తుల మనెడి యహంకారము పెరిగినది. విషయలాలసులై ప్రజా పరిపాలనమందలి కాంక్షకంటె బహుకాంతా పాలనమందలి ప్రీతి హెచ్చినది. వీరి ప్రాపు గోరిన కవులు వారి చిత్తవృత్తుల ననుసరించియే మెలగవలసివచ్చినది. అందుచేత పదునారు పదునేడు శతాబ్దములలో సాహిత్యము జుగుప్సావహమగు కేవల శృంగార వస్తుచిత్రణముతో నిండిపోయినది. ప్రబంధమే దిక్కైచియాటచే గతానుగతికమై పేలవమైపోయినది కవిత. అనుకరణానుసరణములు హెచ్చినవి. ఈవిధముగా నాంధ్ర రాజ్యవైభవముతో సాహిత్య వైభవ మడుగంటినది.

చెప్పుకొనదగిన అంశములు.

కాని నాయకరాజుల కాలములో చెప్పుకొనదగిన అంశము లేకపోలేదు. దేశికవిత కాదరణము మరల రగులు కొన్నది. సంగీత నాట్యముల కాస్థానములో నధిక గౌరవము లభించినది. ప్రజలమీద దృష్టిమరలినది, జాతీయమైన రూపక ప్రక్రియకు దోహద మీయబడినది. యక్షగానములు విరివిగా రచింపబడి ప్రదర్శింప బడినవి. వ్యావహారిక భాష యుపాదేయమైనది. రఘునాథరాయల పరిపాలనాకాలము నకు కృష్ణరాయల పరిపాలనాకాల ముపమానమగును. ఆతడు సంగీతమును ప్రోత్సహించి పదసాహిత్యపోషకుడై ప్రసిద్ధినొందినాడు. ఆంధ్రులు గర్వింపదగిన క్షేత్రయ్య పదములు, త్యాగరాజు కీర్తనము లాకాలమునకు చెందినవే. వాని ననుసరించి

తర్వాత దీక్షితులు, శ్యామశాస్త్రి మున్నగువారనేకులు కీర్తనలను, పదములను, రచించినారు. శృంగార భక్తిపరముగా నీవిధమైన కవిత రచింపబడి ప్రజలను మురిపించి సంస్కరించునదై వరలినది. నాయక యుగములో ప్రజలకు విషయబోధ సులభముగా చేయుటకు పద్యముకన్న వచనమే అనుకూలమైన ప్రక్రియగా కనిపెట్టినారు. వచనములోనున్న అన్వయ సౌలభ్యము పద్యములో నుండదుగదా! అందుచే రాయవాచక కర్త కళువె వీరరాజు, సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు, విజయరంగ చొక్కనాథుడు మొదలైనవారు వచన రచనకు పూనుకొని ప్రజాసేవ చేసినారు. ఈవిధముగా సాహిత్యమును ప్రజలకు సమీపములో నుంచి వారిని విజ్ఞానవతులుగా చేయుటకు ప్రయత్నము లాకాలమందు జరిగినవి.

ఆంగ్ల సాహిత్య ప్రభావము-నూతన ప్రక్రియలు:

తరువాత బ్రిటిషు పరిపాలనా ఫలితముగా నాంగ్ల భాషా సాహిత్యముల ప్రభావము మనపై బడినది. పందొమ్మిదవ శతాబ్ది మధ్యకాలములో నిది నిక్కుటమైనది. సంఘములో, మతములో, సాహిత్యములో మార్పువచ్చినది. 'క్రొత్త యొక వింత ప్రాత యొక రోత' అన్నట్లుగా కొంతకాలము మనవారా మోహాంబుధిలో తలమున్కలువేసి మన వారసత్వమును విస్మరించినారు. మనకు గలిగిన మేలునే యెంచుకొందము. ఆంగ్ల సాహిత్యములో మనకులేని నూత్న ప్రక్రియలకు మురిసిపోయి మనసాహితీసేవకు లట్టివి రచించుట మొదలిడినారు. 'నవల', 'ఉపన్యాసము', 'ప్రహసనము', 'విమర్శ'

తరింపజేసి శ్రీవీరేశలింగముపంతు లాధునికయుగకర్తయైనారు. తాము సంఘసంస్కారియై స్త్రీజనోపయోగార్థ మనేక రచనల సాగించినారు. దీనిని పురస్కరించుకొని తరువాత అనేకులు స్త్రీలకు పాటలు, కథలు వ్రాయుచువచ్చి సులభశైలితో నాంధ్రజాతీయ జీవనమును పాతివ్రత్య ధర్మమును ప్రబోధించినారు. వీరేశలింగముపంతు లవతరింపజేసిన నూతన ప్రక్రియలలో తర్వాత నెందరెందరో కృషిసల్పుచువచ్చినారు. కాని నేటికి ఒక్కదానిలోనైనను పరిణతి పొందలేదు.

వీరేశలింగముపంతులు గద్యశైలీసౌలభ్య కల్పనముకై చేసిన పరిశ్రమనే తిరుపతి వెంకటకవులు పద్యశైలీసౌలభ్య కల్పనమునకై యొనర్చినారు. వీరి ప్రభావము యావదాంధ్ర దేశముపై బడినది.

### భావకవిత్వము.

1910 ప్రాంతమున కాంగ్లసాహిత్యములోని 'రొమాన్టిక్' కవిత మనవారి నాకర్షించినది. ఆవిధమైన ప్రత్యక్షభావ కవిత[1] మన కంతవరకు లేదని యువవిద్యార్థులు గమనించినారు. వారికి వయస్సు, వాతావరణము లనుకూలించినవి. ప్రేయసి, కోకిల, ప్రకృతి నవ్యకవితా ముఖ్యసామగ్రిలో చేర్చినారు. దీనిని అభినవకవిత్వ మనినారు. శ్రీ రాయప్రోలు వారు వరుసగా నావిధమైన కావ్యాలు ప్రచురించినారు.

1 Subjective poetry దీనిని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు ఆత్మాశ్రయ కవిత్వమని వ్యవహరించుచున్నారు.

సంఘ సంస్కారమును, చుక్కానిగా పెట్టుకొని శ్రీ గురజాడ కవి మాత్రాచ్ఛందస్సులో కవితారచన సాగించినాడు. పతితోద్ధరణము సూత్రముగా గ్రహించి పల్లీయులను నాయికా నాయకులుగా గ్రహించి నండూరివారు 'ఎంకిపాటలు' రచించినారు. పూర్వమార్గమును వదలి, నవీన మార్గమందు విశ్వాసము లేని కొందరిని బౌద్ధవాఙ్మయమందలి సత్యాహింస లాకర్షించి కవితావస్తువులైనవి. సౌందరనందాదు లట్టి రచనలే. దీని సంతతిని అప్పటిలో భావకవిత్వ మనినారు. ఇది మొదట కొంతకాలము దూషణమునకు గురియైనది; కాని తరువాత నిలువద్రొక్కుకొనినది.

## వ్యావహారిక భాషావాదము

ఈకాలముననే శ్రీ గిడుగు రామమూర్తి పంతులువారి వ్యావహారిక భాషావాదము ప్రచారములో నున్నది. మన సాహిత్యములో వచనబీజ మంకురించి పెరిగి పెద్దదైనకొలది యాలంకారిక శైలి పుణికి పుచ్చుకొనుచు వచ్చినది. వ్యాకరణముపై నక్కరలేని మోజుపెట్టుకొని పాండిత్యమునంతయు దీర్ఘ జటిల సమాసములలో ప్రదర్శించి కొందరు వచనమును దురవగాహ మొనర్చినారు. అది కృతకభాష యైపోయినది. పద్యమును వదలి వచనమును గ్రహించిన హేతువును విస్మరించినారు. ఈసత్యమును దర్శించి శ్రీ గిడుగువారు భాషావాదమును లేవదీసినారు. ఆంధ్రసాహిత్యపరిషత్తు దీనినిడీకొనినది. **రామమూర్తిపంతులు** శత్రుకోటి నెదుర్కొనినాడు. ప్రజామోదము, నవ్యకవుల అనుసరణమునుబడసి విజయుడైనాడు. దీనికి

వ్యాప్తిలోనున్నది. పై రాయప్రోలు, గురజాడ, గిడుగుల ఉపజ్ఞకమైన భాషాభావ సంస్కరణ ప్రచారము చేయుటకై సాహితీసమితి పుట్టి, పత్రికను స్థాపించి, మిక్కిలి సేవచేసినది. తత్పరిణామముగా వచ్చిన సాహిత్య ప్రక్రియలగు ఖండకావ్య కథానికా ఏకాంకికాదులకు సాహితీపత్రిక దోహద మొసగినది. తర్వాత 'ప్రతిభ' పుట్టి ఆపనిని నిర్వర్తించుచున్నది; ఇది యంతయు నవ్యసాహిత్యమను పేర నేడు పరగుచున్నది.

### పరిశోధనము-చారిత్రక విమర్శ.

1912 ప్రాంతముననే ప్రజలందు విజ్ఞాన వ్యాప్తికై శ్రీకొమర్రాజు లక్ష్మణరావు పంతులవారు పాటుపడుచుండిరి. ఆంగ్ల సాహిత్యములో పరిశోధనము, విమర్శ లత్యంతముగా పెరిగినవి. ఏభాషాసాహిత్యమునకైన నివి లేనిదే ప్రశస్తి లేదు. ఈసత్యమును దర్శించి పంతులుగా రావిధమైన కృషిచేయ నారంభించినారు. చారిత్రక విమర్శకు మార్గదర్శియైనారు. తర్వాత కట్టమంచివారు సాహిత్య విమర్శనమునకు బీజావాపముచేసి తమ ఉపాయనము నొసంగినారు. ఇట్లే సాహిత్య చరిత్రలుకూడ వెలసినవి. ఈవిధమైన విమర్శన సారస్వతము మన కీనాటికిని విరివిగా పెరుగ లేదు. అక్కడక్కడ చిన్నచిన్న యత్నములు జరుగుచున్నవికాని యేకముఖముగా కొనసాగుచు నిర్మాణపరిణతి నందుట లేదు. ఈకాలముననే విశ్వదాత గారు ఆంధ్రపత్రిక స్థాపించి విజ్ఞానవ్యాప్తికి కారకులైనారు.

ఇట్లుండగా యుద్ధానంతరము యూరపు సాహిత్యము మన దేశమునకు దిగుమతి యయ్యెను; తత్పరిణామముగా శ్రీ శ్రీగారి 'అతివాస్తవికత' అంకురించినది. ఈమార్గమిపు డంత ప్రబల ప్రచారములో లేదు.

నేటి సాహిత్యస్థితి.

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధము రానేవచ్చినది; దీనితో మన దేశమునకు దెబ్బతగులునను భయము హెచ్చినది. రష్యా యుద్ధప్రవేశము ప్రజాయుద్ధమను భావమంకురింపజేసినది. ఆత్మ ప్రణయపరమైన నవ్యసాహిత్యముపై తిరుగుబాటు పొసగినది. ప్రేయసిని, కోకిలను విడిచి మన దేశస్థితిని పర్యాలోచింపవలసిన కాలము వచ్చినది. ప్రభువు, పాలేరు సమానమను భావ మంకురించినది. దేశాభ్యుదయమే నేటి మన రచయితల పరమాశయమని గ్రహించినారు. ప్రజా వాఙ్మయము కావలెననెడి యాకాంక్ష పొడమినది. రష్యా వాఙ్మయసూత్రములాదర్శములైనవి. అక్కడి సామ్యవాదము కృషి ఘనత్వ సిద్ధాంతములు మన దేశమున కనూదితము లైనవి; కాని నియంతృత్వ రేఖ లీలగా పొడసూపుచున్నది. వీనికన్నిటికి ఫలితముగా 'అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘము' స్థాపితమైనది. అన్ని భాషలలో నుపసంఘము లేర్పడినవి. మన దేశములో వివిధ భాషాసాహిత్యముల నేక ముఖముగా నడుపవలెనని వీరి కుతూహలము. వైమనస్యములు లేక దేశస్థు లంతా చెట్టపట్టాల్ పట్టుకొని నడవవలెనని వీరి సంకల్పము. ఆదర్శము లుత్తమములైనవే; కాని యాచరణ

ములో బెట్టుటకు ప్రయత్నము లత్యంతముగా జరుగవలసి యున్నవి.

నూతన చైతన్యము.

ఆంధ్ర సాహితీలోకమున నేడు నూతన చైతన్యము కలిగిన దనక తప్పదు, దేశభాషాసేవకులను గుర్తించి వారిని గౌరవించుచున్నారు. ఇది శుభసూచకము. ప్రజలలో సాహిత్యాభిరుచి, గ్రంథపఠనాసక్తి యధికముగా నున్నవి. ఎచ్చట చూచినను సాహిత్య సమావేశములు, కవి సమ్మానములు కన్నులపండువుగా జరుగుచున్నవి. ఎన్నెన్నియో ప్రచురణ సంఘములు, సారస్వత సమితులు పుట్టుచున్నవి. గ్రంథ ప్రచురణ మత్యంతముగా జరుగుచున్నది. పత్రికలు హెచ్చైనవి. తదనుగుణముగా రచయితలకు లెక్కయే లేకున్నది. ఈవిధముగా వాఙ్మయము విరిగా పెరుగుచున్నది. ఏజాతిసంస్కృతియైన నాభాషాసాహిత్య ప్రచారము ద్వారా జరుగుచుండును. ప్రజలు తమ సాహితీరోచిస్సులను ప్రజ్వలిత మొనర్చినచో జాత్యభ్యుదయకారక మగును. ఈయభిప్రాయమునే మాలవ్యాజీ—

Literature was the best medium for improving the character of a nation, and by improving the vernacular literature, you will elevate the nation.

అను వాక్యములో షొందుపరచినాడు. కావున జాత్యభ్యుదయ కారక మగు సాహిత్య మీనాటి మనవాఙ్మయములో నెంత యున్నదో పరిశీలించుకొనవలసియున్నది.

సహృదయులారా! మిమ్ము నేను విసిగించితిని. సమగ్ర సాహిత్యస్వరూప సంగ్రహమును సంక్షిప్తముగా కాలానుకూలముగా మీకు నివేదించితిని. నావి రెండుమాటలు కొనసాగినవి. వాని నాదరముతో గ్రహింతురని విశ్వసింతును.

— సాహిత్యోపాసకుల కర్తవ్యము —

ఈనాడు సాహిత్యోపాసనము ప్రజలపై నెక్కువగా నాధారపడియున్నది. నేటి ప్రజలలో కేవల సాహిత్యాభిరుచి కలిగి సంతసించుటవలన ప్రయోజనము పెద్దగా లేదు. ఉపన్యాసములను వినోదములుగా గ్రహించినచో నవి నిష్ప్రయోజనము లగును. "ఆంధ్రుల కనైకత్వ" మను ప్రవాద మొకటి మనకై నున్నది. దీనివలననే మన సంఘములు, ఉద్యమములు విచ్ఛిత్తి నొందుచున్నవి. వర్గవైమనస్యములు లేక సహృదయులై ప్రజలు సానుభూతితో తిలకించు దృష్టి నలవరచుకొనవలసియున్నది. వివాదముల ఫలమును మనము రుచిచూచియేయున్నాము. కావున ప్రతి ఆంధ్రుడును విద్యావంతుడై, లోకకావ్యాద్యవేక్షణములతో వ్యుత్పన్నుడు కావలెను. తనజాతిభాషాసాహిత్య సంప్రదాయములను పవిత్రముగా నెంచవలెను. సాహిత్యములో వివిధమతములను చారిత్రకదృష్టితో చూడవలెనే కాని పాక్షికదృష్టి పనికిరాదు.

ఉత్తమమైన మానవ జన్మము లభించినందులకు సద్వినియోగ మొనర్పవలెను. ఇతరజీవులవలె గాక మానవున కాత్మభావ వ్యక్తీకరణమునకు యోగ్యత యున్నది. అతనికి విజ్ఞాన సముపార్జనమునకు వలయుశక్తి బీజభూతముగా నున్నది. కాని మానవ జీవితము పరిమితమైనది;

ఆంధ్రసాహిత్యములోని వెలుగుజిలుగులను విప్పి చూపునట్టి గ్రంథములు నేడు విరివిగా రావలసియున్నవి. తాత్కాలిక ప్రయోజనమును దీర్చుకార్యములకన్న శాశ్వతముగా మన జాత్యభ్యుదయమును జాటుకార్యములలో ప్రజాసంస్థలు, సాహిత్యపరిషత్తులు పాటుపడవలెనని సవినయముగా మనవిచేయుచున్నాను. ఏనాడు ప్రతి ఆంధ్రుడట్టి కార్యాచరణమునకు దీక్షవహించి దానిని సాధించునో ఆనాడే తెలుగుజాతి సంపూర్ణావకాశమును పొంది సర్వాంగసుందరముగా విరాజిలును; అంధతమసము లడగంటి జ్యోతిర్లోకమునకు సుగమమైనమార్గ మప్పుడుగాని యేర్పడదు. ఆశుభప్రదమైన ముహూర్త మనతికాలములో రాగలదని విశ్వసింతును.

'అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ'

(17-6-45 నా డీయబడిన ప్రథమ హైదరాబాదు జిల్లా మహాంధ్ర సభా సారస్వత సమావేశపు టధ్యక్షోపన్యాసము.)

# సాహిత్యార్చనము

మానవునకు హితమును బోధించునదియు, లోకము లోని దృశ్యముల నుదాత్తములుచేసి, సకలశాస్త్రములతో సమన్వయించి యాత్మబోధచే నుత్తమ సంస్కారమును కలిగించునదియు, సాహిత్యమని మహితాత్ములు నిర్వచించు చున్నారు.[1] కావ్యప్రపంచ మంతటిని సాహిత్యముక్రింద పరిగణించినారు. నిత్యవ్యవహారములో జరుగుచున్న రచనా వ్యాపార మంతయు విశాలావకాశము కలిగిన వాఙ్మయములోనికి వచ్చును.[2] సాహిత్య మను పదములో విశిష్టత యున్నది. మహాకవి యెంతటి పూర్ణుడో సాహిత్య మంతటి పూర్ణత్వము కలిగినది. సాహిత్య మాలోచనామృతమును ప్రసాదించునట్టిదని శ్లోకకారుడు సూత్రించినాడు :

సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయ౦
ఏక మాపాత మధురం అన్య దాలోచనామృతమ్.

ఇంత మహిమగల సాహిత్యమునకు సృష్టికర్త కవి. అత డుపాసకుడై, ప్రజ్ఞావంతుడై, విశ్వమానవకల్యాణార్థమై ప్రవక్తగా ప్రతియుగమున నవతరించుచుండును. ఈ కవి తాను సృజించిన సాహిత్యముద్వారా బ్రహ్మానంద సహోదరమగు రసానందానుభవమును ప్రసాదించును.

---

1. 'హితేన సహితం సాహిత్యం' 'సహిత్యభావః సాహిత్యం'
2. చూ. 'సాహిత్యోద్దేశము'లో ప్రథమభాగము.

మానవుడు నిరంతర సౌఖ్యాన్వేషి. లోకములో తాను చేయు ప్రతి కార్యములో ఈసూత్రము నన్వయించును. సుఖము లౌకికమైన కారణములచే కలుగు చిత్తరంజక స్థితికి చెందినది. ఈ లౌకిక సుఖమునే కవి చిత్రించి దానిని లౌకికమైన యానందముగా పరివర్తనము చేయును. ఆనందము సుఖమువలె, లౌకికము, నశ్వరము గాక ఉత్తమము, శాశ్వతము నగు మనోరంజకస్థితికి చెందినది. లౌకికానందమున కును పారలౌకికానందమునకును మధ్యస్థితిని కావ్యానంద మాక్రమించుచున్నది. లౌకికానందమునకన్న నుదాత్తమై, పారలౌకికానందమునకు దారి కల్పించునది కావ్యానందము. విజ్ఞానవంతుడైన మానవుడు లౌకిక సుఖములను విడిచిపోనీక శాశ్వతానంద ప్రదాయినియగు గమనమార్గ నన్వేషించుటకు సాధన చేయ సంకల్పించును. సాహిత్యార్చనముచే మానవుని చిత్తము సంస్కృతమై బ్రహ్మజ్ఞాన సముపార్జనమునకు సుముఖమగును. ఈ విధముగా సాహిత్యార్చనము మోక్షసాధనముగా పర్యవసించును.

సాహిత్యార్చనమునకు గడంగుటకు ముందు మానవుడు కొంతయధికారము సంపాదింపవలెను. దేవతార్చన మొనర్చుట కేవిధముగా భక్తి లేక నమ్మకము నుండవ వలెనో యట్లే సాహిత్యార్చనమున కభిరుచి,1 కవివాక్య మందు ప్రామాణ్యము లలవడవలెను. ఈ యభిరుచి లేనిదే సాహిత్యావరణములో ప్రవేశించుట నాస్తికుడైన దేవాలయ ప్రవేశ మొనర్చినట్లగును. వినోదమునకై యర్చనముచేసిన

1 Literary taste ...Arnold Bennett.

నవిహేళనమునకు గురియగును. కావున నిష్కళంకమైన మనసు కలిగి విజ్ఞాన చక్షుస్సులందుకొని పవిత్రభావముతో సాహిత్యము నర్చింపవలెను.[1] సాహిత్యాభిరుచి యలవరచుకొన్నపిమ్మట మానవుడు లోకకావ్యాది పరిశీలనమువలన, పండితుల యుపన్యాసాకర్ణనము వలన సంప్రదాయజ్ఞులైన మహాత్ముల సంసర్గమువలన, చక్కని సంస్కారి కావలెను. కేవల పండితులై శబ్దసాధుత్వాసాధుత్వముల నెన్నుట పాడిగాదు. రసపిపాసియై తాను, భావమునకు శబ్దార్థములు మస్తులవంటివని యెఱింగి యా రసభావము నందుకొనుటకు సహృదయుడై యత్నింపవలెను. కవిహృదయ ప్రవేశముచేసి యాతని భావమును గ్రహింపవలెనేకాని కవియొక్క దేశకాలమానసిక పరిస్థితులను త్రోసివేయరాదు.[2] సాహిత్యార్చకుడు ముఖ్యముగా గమనింపదగిన సూత్రమిది. ముందుగా కవిపై నేవిధమైన కలుషభావము నుంచరాదు. గుణగ్రహణపారీణు లగుటయే సాహిత్యార్చకుల పరమధర్మముగా పరిగణింపవలెను. బ్రహ్మానందము ననుభవించుటకెట్లు మానవు లుత్తములై యుపాసకులు కావలయునో యట్లే కావ్యానందము ననుభవించుటకు సాహిత్యార్చకులు తపశ్శీలురై యుండవలెను. అధికారము నార్జింపనిదే ఆనందాప్తి లేదు. సాహిత్యము మానవ లోకమునకే యుద్దేశింపబడినది. ఈ యమృతభాండము నుప

---

1 You must love them (Poets) and show your love

2 To enter into theirs (thoughts) observe; not to find your own expressee complete. ... Ruskin

యోగించుకొని ఫలమందుట మానవుల విధి. భగవదర్చ మున కెంత చిత్తస్వాస్థ్యము, ఆస్థ కావలెనో యంతటి కేంద్రీ కరణము, రసతృష్ణ సాహిత్యార్చన మొనర్చుటకు వలసి యున్నవి.

అర్చనా ఫలితముగా సాహితీలోకములోని పాత్ర ములతో గాఢ స్నేహము కలుగును. వారితో క్రమముగా తాదాత్మ్యము పొందుట తటస్థించును. అచటి యాదర్శ శీలవంతులతో సాహచర్య మబ్బి వారితో సానుభూతినుంట పొసగును. ఇది కవియొక్క పాత్రచిత్రణా వైశిష్ట్యమును బట్టి అర్చకుని యాత్మశుద్ధి బుద్ధితీక్ష్ణతల ననుసరించి, కలుగు చుండును. ఈ విధముగా సాహిత్యార్చనము జాత్యభివృద్ధికి కారక మగుచుండును.

సాహిత్యములోని యమృతము సామాజికుని పాండిత్య పరిశీలనాశక్తుల ననుసరించి తదనుగుణముగా పొడము చుండును. మథించినకొలది యానంద మధికముగా వెలువడు చుండును. కృషి లేనిదే ఫలముండదు. లౌకిక సౌఖ్యము పొందినట్లు లంచములతో మోసములతో నీ సాహిత్యామృ తమును పొందజాలరు. సాహిత్యము కావ్యపరమైనది.

కవిత్వము లయాన్వితమైనది. ఛందస్సునది లయను పురస్కరించుకొని వచ్చినదే. కవితలో నాద మంతర్వాహి నిగా ప్రవహించుచు శబ్దముల రూపులతో బయటికి కన్పించుచుండును. కవి యా శబ్దములకుండు నర్థములద్వారా భావస్పందనము కల్గించును. మనకున్న సాహిత్యము భావ రాగ తాళ యుతము. భావసౌకుమార్యమును, నాదమాధు

ర్యమును శబ్దవైచిత్రిని ప్రత్యేకముగా ప్రసంగించుచు నలరించు కవు లున్నారు.

మన తెలుగుభాష సహజముగా గానయోగ్యమైనది. ల, న, స అను అక్షరములు వివిధసంపుటులలో మేళనము పొంది మధురమంజుల నాదము నీనుచుండునని తెలియుచున్నది. కొన్ని యక్షరముల పౌనఃపున్యము దరువు వేసినట్లు గతికలిగి యుండును, 'నానాసూనవితానవాసనల నానందించు సారంగ మేలా' అనుపాదములో 'అభంగ తరంగ మృదంగ' అను స్థలములో పైరెంటికి నుదాహరణము లగుపించును. శబ్ద వైచిత్రి మనప్రబంధములలో బహుళముగా కన్పించుచున్నది. భావోపాసకు లనేకులున్నారు. పోతనకవితలో భావప్రాధాన్య మగుపించును. నవ్యులు భావకవు లను పేరువడసినారు.

ఏనకజన్మములోన ఎవరమో నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలక నా మెంకి!
ముందు మన కేజన్మ ముందోలె యంటి
తెల్ల తెలపోయింది పిల్ల నా మెంకి!
ఎన్నాళ్ళు మనకోలె యీ సుకము లంటి
కంట నీరెట్టింది జంట నా మెంకి!

అను పాదములలో శబ్దమునకన్న భావమునకు గౌరవమున్నది. ప్రణయకీర్తనములో లోకతత్త్వమును కవి పాదిగినాడు. భావప్రకాశము వలననే తత్త్వస్ఫురణము కల్గించుటకు ప్రయత్నించినాడు. పునర్జన్మ సిద్ధాంతమును జన్మ జన్మలకు తోంటి భర్తయే వలయుననెడి యుత్తమ స్త్రీ యభిలాషము జోడించి ప్రతిపాదించినాడు. ఈ విధముగా

నవ్యులు ముఖ్యముగా భావోపాసకులు. కావుననే వారి రచన భావకవిత్వమనెడి పేరుగాంచినది. ...... సాహిత్యార్చకులు పక్షపాతము లేకయుండి, ప్రతివిధానములో నున్న విశిష్టతను గ్రహించు శక్తి యలవరచుకొనవలయును.

సాహిత్యము సత్యమును బోధించును; అనుభవ రహస్యముల విప్పి చెప్పును. సౌందర్య స్వరూపమును సాక్షాత్కరించును. ఇంతటి బోధచేయుటకు కవి యెంత ప్రజ్ఞావంతుడు గావలెనోగదా! ఇట్టి ప్రతిభావంతులు పల్వురు తమజీవితము లన్నియు ధారవోసి, తపః ఫలితముగా దర్శించిన విశ్వసత్యములతో గూడిన మహాకావ్య సమూహమైన సాహిత్యము మానవలోకముపాలిటి పెన్నిధియని వేరుగా చెప్పవలెనా? ఈ నిధిని భద్రపఱుపవలసిన బాధ్యత ప్రజలపైనున్నది. దానిని దుర్వినియోగముచేయక, దాని వలన సంక్రమించు సంస్కృతి నంతటిని పుణికిపుచ్చుకొన వలెను. గతానుగతికమయిన నిత్యజీవితమువలన ప్రయోజనము శూన్యము. ఒకజాతి తన భాషాసాహిత్యములను నిలువ బెట్టుకొనకపోయిన నాజాతి నిర్వీర్యమగును. [1]

ఇతర భాషాసాహిత్యములమీద మోజుతో మన భాషాసాహిత్యములను న్యూనతగా చూడరాదు. మన సంప్రదాయమును, సభ్యతను పవిత్రముగా నెంచి నిలుపుకొనవలయును. ఏజాతియొక్క పార్థక్యమైనను భాషాసాహిత్య సంప్రదాయములమీద నాధారపడియుండునని తెలియవలెను. మానవుడు జీవనోపాధి నిమిత్తమై యేమార్గ మనుసరించినను

[1] " The care of the national language is at all times

తన జాతిసాహిత్యముతో పరిచయము విధిగా కల్గియుండవలెను. కేవలము పండితులకే సాహిత్యార్చన ముద్దేశితమైనదని తలంపరాదు. సాహిత్యము జాతియొక్క సమష్టినిధిగాని ప్రత్యేకవ్యక్తుల సొత్తుగాదు. లోకములో మానవులే బుద్ధిమంతులు. తా మా బుద్ధిమత్తను సాహిత్యార్చనమునకు వినియోగించి యుత్తమ సంస్కారులు కా నభిలషింపవలెను.

సమగ్ర సాహిత్య స్వరూప సాక్షాత్కారమైనపిమ్మట సాహిత్యార్చకు లొనర్పవలసిన కర్తవ్య మొకటి యున్నది. వ్యాఖ్యాత లేనిదే కవిప్రభ వెలుగదని యొక యాంగ్ల సూక్తి[1] యున్నది, విమర్శనమే కవిత నుద్దీపింప చేయును. ఆంగ్లసాహిత్యము నవలోకించిన దీని యంతరార్థము వ్యక్తమగును. ఆంగ్లసాహిత్య మెంత యున్నదో దానికి మూడంతలు వ్యాఖ్యాన సారస్వత మున్నట్లు చూడగలము. కావున మనసాహిత్యము ప్రకాశించుటకు సహృదయపూర్వకమైన విమర్శదీపికలు వెలుగొందవలెను. అంతవరకు మన

---

a sacred trust and the most important privilage of the members of a society. Every man of education should make it the obj ect of his increasing concern to preserve his languoge. pure and simple to speak it so far as in his power in all its beauty and perfection. A nation whose language becomes rude and barbarous must be on the brink of barbar ism in regard to everything else. A nation which allows her language to go to ruin is parting with the best half of her intellectual independence and testifies h er willingness to cease to exist." — Malavyaji

1 It is the critic that makes a poet.